లింగమగుంట తిమ్మకవి కృత

# సులక్షణ సారము

(ఛందశ్శాస్త్రము)

-: వ్యాఖ్యాత :-

డాక్టర్. శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం.ఏ., పి.హెచ్.డి

ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు (రిటైర్డు)

ప్రభుత్వ కళాశాలలు








...బ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1.

శ్రీరస్తు

# సులక్షణ సారము

## (ఛందశ్శాస్త్రము)

లింగమగుంట తిమ్మకవి ప్రణీతము.

వ్యాఖ్యాత :

డా. శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు

M. A., Ph. D.

ఆంధ్ర భాషా శాఖాధ్యక్షులు (రిటైర్డు)

ప్రభుత్వ కళాశాలలు.







రోహిణి పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి-1

సు ల క్ష ణ సా ర ము

—జొన్నలగడ్డ మృత్యుంజయరావు



ప్రథమ ముద్రణ :
సెప్టెంబరు - 1997

వెల : రు. 35/-

ముద్రణ :
వంశీకృష్ణా ప్రింటర్స్
విజయవాడ - 2.

ప్రకాశకులు :

ఫోన్ : 73444

రోహిణి పబ్లికేషన్స్
మెయిన్ రోడ్. రాజమండ్రి-1

# పీఠిక

ఆంధ్ర భాషలో ఛందస్సు నేర్చుకొనఁగోరు వారికి సులక్షణసారము ప్రథమ పాఠ్యమైన గ్రంథము.

లింగమగుంట తిమ్మకవియే తద్గ్రంథకర్త. ఇది వెల్లంకితాతం భట్టు కృతమని ప్రచారం నందినది. కాని యది తప్పు. తాతంభట్టు వ్రాసినది కావ్య చింతామణి గాని సులక్షణసారము గాదు.

తిమ్మకవి ప్రథమ శాఖా నియోగి బ్రాహ్మణుఁడు. కాత్యాయన సూత్రుఁడు. కాశ్యప సగోత్రుఁడు, తండ్రి లక్ష్మయ్య; తల్లి తిమ్మాంబ, తాత సర్వన్న. అగ్రజుఁడు రామకవి. రామకవి రచించిన మత్స్య, వామన పురాణములకుఁ దాను లేఖకుఁడనని యీ కవి చెప్పికొనెను.

అన్నయగు రామకవి క్రీ. శ. 1500-70 ప్రాంతము వాఁడగు తెనాలి రామకృష్ణ కవి కల్లుఁడగుటచే రామకవియు నతని తమ్ముఁడగు మన తిమ్మకవియు రామకృష్ణ కవికంటె వయసున నిరువది యిరువది యైదు సంవత్సరములు చిన్నవారయియుందురని తలఁపవచ్చు. అందుచేఁ దిమ్మకవి క్రీ. శ. 1550 ప్రాంతమున నీ గ్రంథమును రచించియుండును.

తిమ్మకవి లింగమగుంట గ్రామ నివాసి. ఇతఁడు రామకృష్ణ కవి గురువగు భట్టరు చిక్కాచార్యుల శిష్యుఁడు. లింగమగుంట సమీప గ్రామమైన చదలువాడలోని శ్రీరామునిఁ దన ఇష్టదైవముగా స్తుతించినాఁడు.

తిమ్మకవి తనకు ముందు వెలసిన లక్షణ గ్రంథములను బరిశీలించి వలసిన విషయముల నందుండి గ్రహించి యీ సులక్షణసారమును రచించెను. ఇందుఁగవి కొన్నిటికి స్వయముగ లక్ష్యలక్షణములనురచించి కొన్నిటికి ఇతర గ్రంథముల నుండి గ్రహించెను. భీమన ఛందము, కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందము, కావ్య చింతామణి, చిత్ర

కవి పెద్దన లక్షణసార సంగ్రహము, శ్రీధరచ్ఛందము, అధర్వణచ్ఛందము, గోకర్ణచ్ఛందము, కవిగజాంకుశము, కవి సర్పగారుడము,వాదాంగ చూడామణి, లక్షణ చూడామణి, ఉత్తమ గండచ్ఛందము, కవి జన సంజీవని మున్నగు లక్షణ గ్రంథముల నుండి పద్యములు స్వీకరింపఁబడినవి. కవిత్రయ భారతము, అధర్వణ భారతము, భాస్కర, రంగనాథ, మొల్ల రామాయణములు, దశకుమార చరిత్ర, యయాతి చరిత్ర, చంద్రభాను చరిత్ర, ప్రద్యుమ్నోపాఖ్యానము, పంచబాణ విలాసము మున్నగు గ్రంథముల నుండియు, భీమకవి చాటువుల నుండియుఁ బద్యము లుదాహృతములు.

తిమ్మకవికిఁ బూర్వులగు భీమన, పెద్దన, అనంతుఁడు మున్నగు వారు స్వయముగా లక్ష్యలక్షణములు రచింపఁగా, నితఁడు తన లక్షణముల కితర గ్రంథముల నుండి లక్ష్యములను గ్రహించెను. ఇతని తరువాతివాఁడగు నప్పకవి యీ విషయమున నితని మార్గము ననుసరించెను.

ఈ వ్యాఖ్యానమును శ్రీ రావూరి దొరసామి శర్మగారి సులక్షణ సార వ్యాఖ్యానము ననుసరించి రచించితిని. వారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఇటువంటి యపురూపములయిన, క్రమముగాఁ గనుమఱుఁగగు చున్న గ్రంథములను వ్యయప్రయాసలకోర్చి మరల వెలుఁగులోనికిఁ దీసి కొనివచ్చుచు విద్యార్థి లోకమునకెనలేని భాషాసేవ చేయుచున్న రోహిణి పబ్లికేషన్సు వారి ప్రయత్నము మిక్కిలి యభినందనీయము.

దీనిని వ్యాఖ్యానించు నదృష్టమును నాకుఁ గలిగించిన వారికి నేను మిక్కిలి కృతజ్ఞుఁడను.

జొన్నలగడ్డ మృత్యుంజయరావు

# విషయసూచిక

## యతిప్రాసలు

వెల్లంకి తాతంభట్టు కృతిగాఁ బ్రసిద్ధమైన

# సులక్షణ సారము

(ఛందశ్శాస్త్రము)

## లింగమగుంట తిమ్మకవి

విరచితము

### అవతారిక

క. శ్రీ వనితాసమ భూతన
యా వక్షోజార్ద్రకుంకు మాంకిత వక్షున్
బావనతర చారిత్రుని
సేవించెదఁ జదలువాడ శ్రీ రఘురామున్. 1

లక్ష్మిదేవితో సమానురాలయిన సీతాదేవి కుచములందలి తడిసిన కుంకుమముచే చిహ్నితమైన రొమ్ము గలవాఁడును, మిక్కిలి పవిత్రమైన చరిత్రగలవాఁడును అగు చదలవాడలోని శ్రీరఘురాముని గొలిచెదను.

సీ. శ్రీ వైష్ణవహితుండఁ, జిక్కయభట్టరు
శిష్యుఁడఁ, గవితావి శేష శేష
తులిత సర్వార్యపౌత్రుండ, లక్ష్మయకుఁ ది
మ్మాంబకు సుతుఁడఁ, బేరనకు మాచ

నకు రామకవివరు § నకు ననుజన్ముఁడ,
నా రామకవిచెప్పు § నట్టి మహిత
మత్స్య పురాణ వా § మన పురాణాది స
త్కవితల కెల్ల లే § ఖకుఁడ, వృద్ధ

గీ. కుండికాతీర లింగమ § గుంట నామ
పట్టణస్థితికుండ, సౌ § భాగ్య యుతుఁడ,
నాదిశాఖా ప్రవ ర్తన § నమరువాఁడఁ,
గాశ్యపసగోత్రుఁడను, దిమ్మ § కవిని నేను. 2

నేను శ్రీవైష్ణవహితుఁడను. చిక్కయ భట్టరు శిష్యుఁడను. కవితా విశేషమునందు శేషునితో దుల్యుఁడయిన సర్వార్యుని పౌత్రుఁడను. లక్ష్మయ్యకుఁ దిమ్మాంబకుఁ గుమారుఁడను. పేరన మాచన రామకవివరులకుఁ దమ్ముఁడను, రామకవి రచిత మత్స్య వామన పురాణాదులకు లేఖకుఁడను. వృద్ధ కుండికాతీరస్థ లింగమగుంట నామక పత్తన స్థితుఁడను. ఆదిశాఖా ప్రవర్తనుఁడను. కాశ్యపసగోత్రుఁడను, తిమ్మకవిని.

## ఛందోమహిమ

క. విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబు; మఱి క § విత్వము ఛందో
వేద్యము గావునఁ జెప్పెద
హృద్యంబుగఁ గవిత చంద § మేర్పడఁ గృష్ణా! 3
(అనంతుని ఛందము)

విద్యలన్నిటియందును కవిత్వ ముత్తమము. కవిత్వము ఛందస్సుచేఁ దెలియఁదగినది. కావునఁ గవితా విధము స్పష్టమగునట్లు హృద్యముగాఁ జెప్పెదను.

క. లక్షణ శాస్త్రములెల్లఁ బ
రీక్షించుటఁ గొంత కొంత యెఱిఁగిన వాఁడన్.
లాక్షణికానుగ్రహత సు
లక్షణసారము రచింతు లక్ష్యము లమరన్. 4

నేను లక్షణ శాస్త్రముల నన్నింటిని బరీక్షించినవాఁడ నగుటచే ఛంద శ్శాస్త్రమును గొంత కొంత తెలిసినవాఁడను. పూర్వాలాక్షణికాను గ్రహముచే లక్ష్యములతో సులక్షణ సారమును రచింతును.

తే. కొంద ఱెంచెడు రీతులఁ గొందఱెంచ,
రందఱును జెప్పినవి గొన్ని యనియు నవియు
దొరయఁగాఁ బూర్వకవి సమ్మతులను వ్రాయు
దుక్త లక్ష్యాన్వితంబులు లాం ప్రోక్తమైనయ. 5

పూర్వలాక్షణికులు కొందఱు చెప్పిన వానిని మఱికొంద ఱంగీకరింపలేదు. అందఱును జెప్పిన ఆయా లక్షములను సకలకవి సమ్మతము లను లక్ష్యములతో వీ సులక్షణ సారమును రచింతును.

తే. గ్రంథ సామగ్రి గలుగుటఁ బ్రతిపదమున
కన్ని లక్షణములు వ్రాయు దనిన నందు
గ్రంథ విస్తరమగుఁ గానఁ గదిత సూత్ర
మెన్నిటను దేటపడు నన్ని యే రచింతు. 6

పెక్కు లక్షణ గ్రంథము లుండుటచేఁ బ్రతి పదమునకును లక్షణము చెప్పినచో గ్రంథము పెరుఁగును. కావున నేమి చెప్పిన గవిత్వ లక్షణము తెలియునో దానిని మాత్రమే వ్రాయుదును.

కావున నిది ఛందస్సార మగుటచే దీనికి సులక్షణసారమను పేరు సార్థకము.

# సంజ్ఞా ప్రకరణము

## మాత్రా లక్షణము

క. మాత్రయన నొక్కలఘువగు
మాత్రలు రెండైన గురువు మఱియెన్నఁబడున్;
ధాత్రిని నఱువది నాలుగు
మాత్రలుగాఁగందమునకు మాత్రలు వెలసెన్. 7

మాత్ర యనఁగా ఱెప్పపాటు కాలము. ఒక మాత్రా కాలములో నుచ్చరింపఁబడు అక్షరము లఘువు అనఁబడును. ఉదా. అ, ఇ, ఉ, ఋ, క, చ, ట మున్నగునవి. రెండు మాత్రల కాలములో నుచ్చరింపఁబడు అక్షరము గురువు. ఉదా. ఆ, ఈ, ఊ, ౠ, ఐ, ఔ, కా, చా, టా మున్నగునవి.

కంద పద్యమున మొత్తము అఱువది నాలుగు మాత్రలుండును.

## గురు లఘువుల స్వరూపము

క. వివిధముగఁ జాఁచి పలికెడు
నవియును, మఱి యూఁదిపలుకునవియును గురువుల్;
భువి నిలిపి పలుకు వర్ణము
లవియెల్లను లఘువులయ్యె; నంబుధి శయనా! 8
(అనంతుని ఛందము)

దీర్ఘాచ్చులును, దీర్ఘాచ్చులతోఁ గూడినహల్లులును గురువులు. ఉదా: ఆ, ఈ, ఊ, ౠ, ఏ, ఐ, ఔ; కా, గా, చా, కై, కౌ మొదలగునవి. మఱియు ఊఁది పలుకఁబడు అక్షరములు గురువులు, ద్విత్వాక్షరమునకుగాని, సంయుక్తాక్షరమునకుఁగాని ముందున్న అక్షరము గురువు.

అమ్మ, క ర్త, నిలిపి పలుకఁబడు వర్ణములు లఘువులు. అనఁగా ఏక మాత్రా కాలములోఁ బలుకఁబడు వర్ణములు లఘువులు. ఉదా. అ, ఇ, ఉ, కృ, క, ఖ, ఛ మొదలగునవి.

క. గురువులు-నిడుదలు, జడ్డ
క్కరములు బొట్టుల పిఱుంద కడ నూఁదిన య
క్కరములు; పెఱయవి లఘువులు;
గురులఘువులు మూఁడు గూడి కొనగణములగున్
(భీమన ఛందము)

దీర్ఘాక్షరములు, ద్విత్వ, సంయుక్తాక్షరములకు ముందున్న యక్షరములు, పూర్ణానుస్వారమునకు ముందున్న అక్షరములు గురువులు, తక్కినవి లఘువులు. ఉదా. ఆ, ఐ, ఔ, కా, కై, చక్కన, సర్వ, అం, కం ద్విత్వ సంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములు గురువులగాని, ఆ ద్విత్వ సంయు క్తములు లఘువులే. ఉదా. క ర్త ఇందు 'క' గురువు 'ర్త' లఘువు.

విసర్గముతోఁ గూడిన అక్షరములు గురువులు. ఉదా. అః: కః.

పొల్లులతోఁ గూడినవియు గురువులు. అన్, కల్, ముల్, ధుత్ అన్ అనునది ఏకాక్షరమే.

ఏక పదములోఁగాని ఏకసమాసములోఁగాని ద్విత్వ సంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములే గురువులగును. కాని వేర్వేఱు పదములలో ద్విత్వ, సంయు క్తాక్షరములకు ముందటి యక్షరము లూఁదఁబడకపో వుటచేనవి గురువులుకావు.

ఉదా. పుణ్యము ఇందు 'పు వర్ణము గురువు.

పుణ్యక్షేత్రము. ఇందు 'పుణ్యక్షేత్రమనునది యొక సమాసము గావున ఇందలి 'ణ్య' గురువగును.

రాముఁడు క్షత్రియవీరుఁడు-ఇవి వేర్వేఱు పదములు గావున 'క్ష' అను సంయుక్తాక్షరమునకు ముందున్నను, 'డు'వర్ణము గురువు కాదు లఘువే.

గురువులు కాని యక్షరములు లఘువులు.

గురులఘువులు మూఁడు కూడుకొన్నచో గణమగును. గణములలో గొన్ని యేకాక్షరములు. కొన్ని రెండక్షరములతోఁగూడికొన్నవి. కొన్ని మూఁడక్షరములు గలవి. మఱికొన్ని నాలుగక్షరములు గలవు.

## గురులఘువులకు గుఱుతులు

క. గురువులకు సంజ్ఞ యొక్కొ-
ట్ల రయం దలక్రిందు వ్రాయు శ్రీ నటులం జెలఁగున్;
ధరపై లఘువులు వెలయున్
గరిమన్ నిడుగీటు వ్రాయు శ్రీ కరణి ముకుందా! 10

తెలుగులో ఒకటి యను సంఖ్య గుఱుతగు '౧' అనుదానిని దల క్రిందుగా వ్రాసితిమేని, అది గురువునకు గుర్తు. '|' అను విధముగా నిలువుగీఁతను వ్రాసితిమేని, అది లఘువునకుఁ జిహ్నము.

## గణ స్వరూప నిరూపణము

క. గగణంబగు నేక గురువు,
లగణంబగు నేక లఘువు శ్రీ లాలిత్యముగా,
వగణమగు లఘువు గురువును,
హగణంబగు గురువు లఘువ శ్రీ హార్పతితేజా. 11

(భీమన ఛందము)

ఒకే గురువుగలది 'గ' గణము. ఒకే లఘువు గలది. 'ల'గణము. ఒక లఘువు, ఒక గురువు గలది 'వ' గణము. ఒక గురువు, ఒక లఘువు గలది 'హ' గణము.

క. లలమునకు రెండు లఘువులు,
వలనొప్పఁగ లఘువు గురువు వరుసను లగమై,
గలమయ్యె గురువు లఘువును,
జలజాక్షా! గగము సంగఁ జను గురు యుగమున్. 12

| | |
|---|---|
| రెండు లఘువులతోఁగూడినది 'లల'ము | I I |
| ఒక లఘువు, ఒక గురువును ఉన్నచో 'లగ'ము. | I U |
| ఒక గురువు, ఒక లఘువును ఉన్నచో 'గల'ము. | U I |
| రెండును గురువులయినచో 'గగ'ము. | U U |

'లల'మును 'లా' అనియు, 'గగ'మును 'గా' యనియు నన వచ్చును.

క. 'శౌరి' యనిన హగణంబగుఁ,
జేరి 'వారీ' యనిన మల్ల సిల్లును వగణం,
బారయఁ 'గన్లా' యనినను
ధారుణి గగమండ్రు, లలము దా 'హరి' యన్నన్ 13
(అనంతుని ఛందము)

I I
I I - లల - లా - హరి

I U
I U - లగ - వ - హరా

U I

U I - గల - హ - శౌరి

U U

U U - గగ - గా - కృష్ణా

## వమ గణములు లేదా ప్రధాన గణములు

క. గురువులు మూఁడిడ మగణము,
వరఁగంగా నాది గురువు భగణం బయ్యెన్;
ధరమధ్య గురువు జగణము,
నరనగుణా! యంత్యగురువు సగణం బయ్యెన్. 14

(భీమన ఛందము)

క. నగణంబు మూఁడు లఘువులు,
యగణంబున కాదిలఘువు, యమతనయ నిభా!
రగణంబు మధ్యలఘువగు,
తగణంబున కంత్యలఘువు, దాక్షిణ్యనిధీ! 15

(భీమన ఛందము)

ఇవి యెనిమిది

1. మగణము - మూఁడక్షరములును గురువులుగాఁ గలది U U U
2. భగణము - ఒక గురువు, రెండు లఘువులు గలది. U I I
3. జగణము - మధ్యాక్షరము గురువుగాఁ గలది. I U I
4. సగణము - చివరి యక్షరము గురువుగాఁ గలది. I I U
5. నగణము - మూఁడక్షరములును లఘువులుగాఁగలది. I I I
6. యగణము - మొదటి యక్షరము లఘువు, తక్కిన రెండును గురువులుగాఁగలది. I U U

7. రగణము - మధ్యాక్షరము లఘువుగాఁ గలది. U I U

8. తగణము - చివరి యక్షరము లఘువుగాఁ గలది. U U I

## ప్రధాన గణముల కుదాహరణములు

క. మగణము 'శ్రీనాథా' యన
భగణము 'కేశవ' యనంగఁ బరికింపఁగా;
జగణము 'ముకుంద' యనఁగా,
నగణము 'వరదా' యనంగ సర్వజ్ఞనిధీ! 16

క. నగణము 'వరద' యనంగా,
జగతి 'మురారి' యనంగఁ జను యగణంబున్,
రగణంబు 'మాధవా' యన,
తగణము 'దైత్యారి' యనఁగఁ దామరసాక్షా! 17

| సంఖ్య | గణము | గుఱుతు | ఉదాహరణములు |
|---|---|---|---|
| | | | U U U |
| 1. | మగణము | U U U | శ్రీనాథా |
| | | | U I I |
| 2. | భగణము | U I I | శ్రీహరి |
| | | | U I I |
| 3. | జగణము | I U I | విరించి |
| | | | I I U |
| 4. | సగణము | I I U | నగరీ |

| | | | |
|---|---|---|---|
| | | | I I I |
| 5. | నగణము - I I I - | | లలన |
| | | | I U U |
| 6. | యగణము - I U U - | | మురారీ |
| | | | U I U |
| 6. | రగణము - U I U - | | మాధవా |
| | | | U U I |
| 8. | తగణము - U U I - | | మాయావి |

క. నగణముపయి గురువున్నన్
నగమగు, లఘువున్న యెడల నలమగు వరుసన్,
నగణము పయి లఘువున్నన్
దగనలమగుఁ గంజహిత సుధాకరనయనా! 18

| | | | |
|---|---|---|---|
| | | | I I I U |
| 1. నగణము పయి గురువున్నచో 'నగము' | I I I U | | వరదుఁడా |
| | | | I I I I |
| 2. నగణము పయి లఘువున్నచో 'నలము' | I I I I | | వరదుఁడు |
| | | | I I U I |
| 3. నగణము పయి లఘువున్నచో 'సలము' | I I U I | | వరదుండు |

ఉపగణములు - సూర్యేంద్ర చంద్రగణములు

క. నల, నగ, నల, భ, ర, తలునా
నెలమిని నీయాఱు గణము లింద్రగణంబుల్;
గల, నగణములీ రెండును
జలజాప్త గణంబు లయ్యె జగదాధారా! 19

సూర్యగణములు రెండు.

U I
1. హగణము - U I - రామ

I I I
2. నగణము - I I I - శివుడు

ఇంద్రగణములు ఆఱు

I I I U
1. నలము - I I I I - వరదుఁడు

I I I U
2. నగము - I I I U - వరదుఁడా

I I U I
3. నలము - I I U I - వరదుండు

U I I
4. భ - U I I - రాముఁడు

U I U
5. ర - U I U - శంకరా

U U I
6. త - U U I - దైత్యారి

## చంద్ర గణములు పదునాలుగు

I I I U U
1. నగగ I I I U U కమలవైరీ

I I I U I
2. నహ I I I U I కమలవైరి

I I U I I
3. సలల I I U I I కమలానన

| | | | |
|---|---|---|---|
| 4. | భల | U I I I | U I I I<br>శ్రీకరము |
| 5. | భ గురు | U I I U | U I I U<br>వానరము |
| 6. | మ లఘు | U U U I | U U U I<br>శ్రీరాముండు |
| 7. | సవ | I I U I U | I I U I U<br>భువనేశ్వరీ |
| 8. | సహ | I I U U I | I I U U I<br>దితిజద్వేషి |
| 9. | తల | U U I I | U U I I<br>సీ తా ప తి |
| 10. | రల | U I U I | U I U I<br>కైటభారి |
| 11. | నవ | I I I I U | I I I I U<br>గజవరదా |
| 12. | నలల | I I I I I | I I I I I<br>ధరణిపతి |
| 13. | రగురు | U I U U | U I U U<br>పాండితీశ్రీ |
| 14. | తగ | U U I U | U U I U<br>చంద్రాననా |

## వృత్తగణ ప్రస్తారము

క. చాలుగను సర్వగురులిడి,
లాలితముగ గురువు క్రింద నీ లఘువు, వలపటన్
ఓలి సమంబులు, దావలి
వ్రాలకు గురువులను నిల్పఁ ప్రస్తారమగున్. 20

క. ఎన్నవ ఛందం బడిగిన
నన్నియు గురులిడుచు మఱి గ నాష్టకమును దాఁ
బన్నుచు లఘువులె తుదగా
నెన్నిక నిడ వృత్త సంఖ్య నేర్పడవచ్చున్. 21

ఛందః ప్రస్తార పద్ధతి ఈ పద్యమునఁ జెప్పఁబడినది.

వృత్తములు అక్షరగణ నిబద్ధములు. వీని యందు నాలుగు పాదము లుండును. వృత్తపాదమున నొక యక్షరము మొదలు ఇరువది యాఱక్షరముల వఱకు నుండును. వృత్తపాదమున నెన్ని యక్షరము లుండునో యా వృత్త మన్నవ ఛందమున బుట్టినదని యెంచవలయును. కావున ఇరువదాఱు ఛందము లున్నవని యెఱుఁగవలయును. ఆయా ఛంద ములతోఁ బుట్టు గురులఘుక్రమమును దెల్పు గణితమునకుఁ బ్రస్తార మని పేరు.

## ప్రస్తార విధానము

ఎన్నవ ఛందమునకుఁ బ్రస్తారము చేయవలయునో అన్ని గురు వులు అడ్డముగా వ్రాసి, మొదటి గురువు క్రింద లఘు వుంచి, దాని కుడి ప్రక్క (వలపల)పై వరుసలో నున్న వానినే నిలుపవలయును. మొదటి గురువు క్రింద లఘువు నుంచవలయును. ఎడమ ప్రక్క (దాపల) గురువు

క్రింద లఘువును, లఘువు క్రింద గురువును వ్రాయవలెను. ఇట్లే తక్కిన వరుసలలో మొదటి గురువు క్రింద లఘువును నిలిపి, వలపల పై వరుసలో నున్న గురు లఘువులను సమముగా గురువు క్రింద గురువును, లఘువు క్రింద లఘువును బెట్టి, దాపల గురువు క్రింద లఘువును, లఘువు క్రింద గురువును వ్రాయవలెను. ఈ రీతిగా మొదట ఎన్ని గురువులు మొదట నుంచితిమో అన్ని లఘువులు వచ్చు వఱకును వ్రాయవలయును. ఇట్టి గణనా పద్ధతికిఁ ప్రస్తార మని పేరు.

ఈ దిగువ నిచ్చిన దానినిబట్టి ప్రస్తార విధానము తేటపడగలదు

మొదటి ఛందము

U
I

రెండవ ఛందము

U U
I U
U I
I I

మూఁడవ ఛందము

U U U
I U U
U I U
I I U
U U I
I U I
U I I
I I I

మొదటి ఛందమున రెండు వృత్తములును, రెండవ ఛందమున నాలుగు వృత్తములను, మూఁడవ ఛందమున ఎనిమిది వృత్తములును—ఇట్లే తరువాతి ఛందములలో రెట్టింపుగా వృత్తములు జనించునని తెలియవలయును.

వృత్త సంఖ్యను జెప్పెడు విధము

6–వ ఛందమునకు వృత్త సంఖ్య.

| | | | | | |
|---|---|---|---|---|---|
| U | U | U | U | U | U |
| 2 | 4 | 8 | 16 | 32 | 64 |

6–వ ఛందమునకు 64 వృత్తములు పుట్టునని యెఱుఁగునది.

## సూర్యేంద్ర చంద్రగణోత్పత్తి

క. ద్విత్రిచతుర్గురు భవములు
ధాత్రీధర, రెండు నుడుపఁ దక్కిన గణముల్
మిత్రేంద్ర చంద్రు లనఁ దగు
మాత్రాది గణంబు మొదల మాత్ర లిడంగన్ 22

ఛందః ప్రస్తారము నుండి యుప గణములయిన సూర్యేంద్ర చంద్ర గణముల యుత్పత్తి నెఱుఁగు మార్గమీ పద్యము తెలుపుచున్నది.

రెండు, మూఁడు నాలుగు ఛందములు ప్రస్తరించి అందు మొదటి రెండు వరుసలు విడిచి తక్కిన బంతులలో మొట్టమొదట లఘువున్న దానికి మొదటి మఱియొక లఘువు నిలిపి గణములు చేసిన రెండవ ఛందము లోనికి సూర్యగణములు, మూడవ ఛందములోనికి ఇంద్ర గణములు నాలుగవ ఛందములోనికి చంద్ర గణములు నగును.

సూర్యేంద్ర చంద్ర గణ ప్రస్తారము

రెండవ ఛందమునఁ బుట్టిన సూర్యగణములు

U U
I U — ఈ మొదటి రెండు వరుసలు విడిచిపెట్టవలయును.

U I (గల) హ
I I I (ఇది మాత్రాదిగణముగాన దీని మొదట మఱియొక అనఁగా లఘువు నిలుపవలయును)

మొత్తం 2 గణములు

మూఁడవ ఛందమునఁ బుట్టిన ఇంద్రగణములు

U U U
I U U — ఈ మొదటి రెండు వరుసలు విడిచిపెట్టవలయును.

U I U - ర

I I I U - నగ

U U I - త

I I U I - సల

U I I - భ

I I I I - నల

మొత్తం 6 గణములు ఇంద్రగణములు

నాల్గవ చంధమునఁ బుట్టిన చంద్రగణములు

| | |
|---|---|
| U U U U<br>I U U U | ఈ మొదటి రెండు వరుసలు విడిచి పెట్టవలయును. |

U I U U - ర — గురు

I I I U U - నగగ

U U I U - తగ

I I U I U - సవ

U I I U - భ గురు

I I I I U - నవ

U U U I - మల ఘు

I I U U I - సహ

U I U I - రల

I I I U I - సహ

U U I I - తల

I I U I I - సలల

U I I I - భల

I I I I I - నలల

మొత్తము 14 గణములు చంద్రగణములు

## జాత్యుపజాతులు

పద్యములు వృత్తములనియు, జాతు లనియు రెండు విధములు. అక్షరగణ నిబద్ధములు వృత్తములు. ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము మున్నగునవి వృత్తములు.

మాత్రాగణ నిబద్ధములు జాతులు. జాతులయందు మాత్రాగణములే. కాక ఉపగణములుగూడ నుండును.

ఉపజాతులను భేద మొకటి గలదు.

కందము, ఉత్సాహ, ద్విపద, తరువోజ, అక్కర మున్నగునవి జాతులు.

తేటగీతి, ఆటవెలది, సీసము అనునవి ఉపజాతులు.

జాతులకు వృత్తములవలె యతిప్రాస నియమము గలదు.

ఉపజాతులకుఁ బ్రాస నియమములేదు. ఉపజాతులు కేవలము దేశి పద్యములు.

ఇందుఁ బ్రసిద్ధములైన జాతులు మాత్రమే చెప్పఁబడును.

## కందము

క. కందము:—త్రిశర గణంబుల
నందము, గాభ జసలము కలట, వడి మూఁటన్
బొందును, నలజల నాఱిట
నొందుం, దుదగురువు, జగణ మొండదు బేసిన్ 23

త్రి = 3 శర = 5. మన్మధ శరము లైదు కావున శరమను నది 5 సంఖ్యను జెప్పును.

కందమున నాలుగు పాదములుండును.

4)

మొదటి పాదమున మూఁడు గణములును, రెండవ పాదమున అయిదు గణములును ఉండవలయును. అట్లే మూఁడవ పాదమున మూఁడు గణములును, నాల్గవ పాదమున అయిదు గణములును ఉండవలయును.

ఆ యెనిమిదియు 1. గగ, 2. భ, 3. జ, 4. స, 5. సలములను గణములలో నేవియైనను గావలయును.

ఆఱవ గణము 'నలము'గాని, 'జ' గణముగాని కావలయును.

రెండవ, నాల్గవ పాదముల కడపటి యక్షరము గురువు కావలయును. అనఁగా, గగ, సగణములలో నేదో యొకటి కావలయును.

బేసిగణము—అనఁగా మొదటిది, మూఁడవది, అయిదవది, ఏడవది జగణము కారాదు.

రెండవ పాదమునను, నాల్గవ పాదమునను నాల్గవ గణము మొదటి యక్షరము యతియై యుండవలయును.

ఈ లక్షణము పయి పద్యముననే సమన్వయింపఁబడును.

మొదటి పాదము

| | | |
|---|---|---|
| U I I | I I I I | U I I |
| కంఠము | త్రిశరగ | ణంబుల |
| భ | నల | భ |

| | | | | |
|---|---|---|---|---|
| U I I | U I I | I I I I | I I I I | U U |
| నందము | గా భజ | స నలము | లటవడి | మూఁటన్ |
| భ | భ | నల | నల | గగ |

ఈ పద్యములో ఆఱవ గణము 'నల,' 'జ' గణములలోనొక్కటియై యుండవలయునను నియమము చొప్పున 'నలము' అయియున్నది.

1, 3, 5, 7 అను బేసిగణములలో 'జ' గణములేదు.

రెండవ పాదము కడపట 'టన్' అని గురువున్నది.

నాల్గవ గణము మొదటి యక్షరముతో యతిమైత్రి చెల్లినది. (అం—అ).

ఇట్లే మూఁడు నాలుగు పాదములకును గణవిభజనము చేయఁబడుచున్నది.

| | | |
|---|---|---|
| భ | నల | భ |
| U I I | I I I I | U I I |
| బొందును | నల జల | నాటి ట |

| | | | | |
|---|---|---|---|---|
| గగ | నల | నల | భ | గగ |
| UU | I I I I | I I I I | U I I | U U |
| నొందుం | దుద గురు | వు జగణ | ముండదు | బేసిన్ |

వీనియందును మొత్తము 8 గణములున్నవి. బేసి గణము జగణము కాలేదు. ఆఱవ గణము 'నల' మయినది. నాల్గవ గణము మొదటి యక్షరముతో యతిమైత్రి చెల్లినది. ఒం—ఉం నాల్గవ గణము పాదాంతమున 'సిన్' అను గురువున్నది.

## ఉత్సాహ

సాహచర్య పద్మమిత్ర సప్తకంబు గురువు ను
త్సాహవృత్తమునకె చెల్లు జలజదళవిలోచనా!

పద్మమిత్ర సప్తకంబు - ఏడు సూర్యగణములు.

'ఉత్సాహ'లో నాలుగు పాదము లుండును.

ప్రతి పాదమునకు ఏడు సూర్యగణములును, ఆ పైనొక గురువు ఉండవలయును. మొదటి అక్షరమునకును అయిదవ గణము మొదటి యక్షరమునకును యతి మైత్రి. నగణ హగణము లనెడి ద్వివిధ సూర్యగణములు కలిసి ఏడు గణము లుండును.

కేవల న గణములతోఁ గాని, హ గణములతోఁగాని ఉత్సాహ కానేరదు.

అన్నియు హ గణము లయినచో సుగంధి వృత్తమగును.

అన్నియు న గణము లయినచో తరళ మగును.

ఉత్సాహ జాతులలోనిది.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| హ | హ | హ | హ |
| U I | U I | U I | U I |
| సాహ | చర్య | పద్మ | మిత్ర |

| 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|
| హ | హ | న | గ |
| U I | U I | I I I | U |
| సప్త | కంబు | గురువు | ను (త్సా) |

ఇందు 7 సూర్యగణముల మీఁద ఒక గురు వున్నది. పాదాద్యక్షర మగు 'సా' కును, అయిదవ గణము మొదటి యక్షరము 'స' కును యతి మైత్రి చెల్లినది.

## ద్విపద

క. ఎలమిన్ మూఁడింద్రగణం
బులపై నొకసూర్య గణముఁ జొ బొందించిన న
ల్లలితముగ ద్విపదలక్షణ
మిలఁ బధములఁ రెండు ప్రాస జేకము కృష్ణా! 25

ద్విపదకు రెండే పాదము లుండును ద్వి-పద = రెండు పాదములు గలది. ఒక్కొక్క పాదమునకునుమూఁడింద్రగణముల మీఁద నొక సూర్య గణ ముండును. మొదటి యక్షరమునకు, మూడవగణము మొదటియక్షర

మునకు యతి మైత్రి చెల్ల వలయును. రెండు పాదములందును ప్రాస మైత్రిచెల్లవలయును.

ఇంద్రగణములు మూఁ డి డినగణం బొకటి
చంద్రాన్య! ద్విపదకుఁ జను జెప్ప రేచ! 26

(భీమన ఛందము)

| 1 ఇం. | ఇం. 2 | ఇం. 3 | 4 సూ |
|---|---|---|---|
| భ | న గ | న గ | న |
| U I I | I I I U | I I I U | I I I |
| ఇంద్ర గ | ణములుమూఁ | డిన గణం | బొకటి |
| త (ఇం) | న ల (ఇం.) | స ల (ఇం.) | హ సూ. |
| U U I | I I I I | I I U I | U I |
| చంద్రాన్య! | ద్విపదకుఁ | జనుఁ జెప్ప | రేచ ! |

పై పద్యమున రెండు పాదములు గలవు. ప్రతి పాదమునకు 3 ఇంద్ర గణములు, ఒక సూర్యగణము గలవు.

మొదటి పాదమున 'ఇం' అను మొదటి యక్షరమునకును మూఁడవ గణము మొదటి యక్షరమైన 'ఇ' కారమునకును యతిమైత్రి చెల్లినది, రెండవ పాదమున మొదటి యక్షరమగు 'చం' అనుదానికిని మూఁడవ గణము మొదటి యక్షరమైన 'జ' అనుదానికిని యతిమైత్రి చెల్లినది. రెండు పాదములలోను రెండవ యక్షరము 'ంద్ర' ఉండుటచేఁ ప్రాసమైత్రి చెల్లినది.

నడురాత్రి యరుదెంచి నరలోకనాథ
కడుదస్సి నాఁడవు కచుమోడ్పుగాక. 27

(రంగనాథ రామాయణము)

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| ఇం | ఇం | ఇం | సూ. |
| స ల | స ల | స ల | హ |
| I I U I | I I U I | I I U I | U I |
| నడు రాత్రి | యరు దెంచె | నరలోక | నాథ |
| ఇం | ఇం | ఇం | సూ. |
| స ల | భ | స ల | హ |
| I I U I | U I I | I I U I | U I |
| కడు దస్సి | నాఁ డపు | కచు మోడ్తు | గాక |

## తరువోజ

నలనామగణము లి ꠶ నగణంబుతోడ
నాలుగుగాఁ జేసి ꠶ నయముతోడుతను
కలయంగ నెనిమిది ꠶ గణములై రెండు
గణముల తుదఁగూడఁ ꠶ గా యతి నిల్పి
వెలయంగఁ బాదముల్ ꠶ విరచింపవళ్ళు
వేర్వేఱ నిప్పాట ꠶ విదితమైయుండ
నలలితగతిఁ గృతి ꠶ చలఁజెప్పఁడనియె
జానుగాఁ గవిజనా ꠶ శ్రయుఁడు తర్వోజ 28

(భీమన ఛందము)

తరువోజ యందు నాలుగు పాదము లుండును. ఒక్కొక్క పాద మునకు మూఁడింద్రగణములు, ఒక సూర్యగణము, మరల మూఁడింద్ర గణములు ఒక సూర్య గణము నుండవలయును. ఇట్లు పాదమున కెనిమిది గణములుండును. మొదటి యక్షరమునకును, మూఁడవ గణము మొదటి

యక్షరమునకును, అయిదవ గణము మొదటి యక్షరమునకును, ఏడవ గణము మొదటి యక్షరమునకును యతి మైత్రి చెల్లవలయును. ప్రతి పాదమునను ఏకాక్షర మైత్రియే యుండవలయును. అన్ని పాదములందును ప్రాస మైత్రి చెల్లవలయును. ద్విపద పాదములు రెండు కలిసినచోఁ దరువోజ పాదమగును. నలనామ గణములు = ఇంద్ర గణములు.

| | | | |
|---|---|---|---|
| 1. ఇంద్ర | 2. ఇంద్ర | 3. ఇంద్ర | 4. సూర్య |
| స ల | న ల | స ల | హ |
| I I U I | I I I I | I I U I | U I |
| నలనామ | గణము లి | నగణంబు | తోడ |
| 5. ఇంద్ర | 6. ఇంద్ర | 7. ఇంద్ర | 8. సూర్య |
| భ | త | న గ | న |
| U I I | U U I | I I I U | I I I |
| నాలుగు | గాఁ జేసి | నయము తో | డు తను |

పయి తరువోజ పాదమున 3 ఇంద్రగణములు, ఒక సూర్యగణము 3 ఇంద్రగణములు, ఒక సూర్యగణము = మొత్తము 8 గణములున్నవి. పాదాది 'న' కారమునకును 3, 5, 7 గణముల మొదటి యక్షరములకును న — నా — నా — న యతిమైత్రి చెల్లినది.

## మధ్యాక్కర

సురరాజ యుగముతోఁ గూడి
సూర్యుతో నొడఁబడియుండి
సురరాజ యుగముతోఁ గూడి
సూర్యుతో నొడఁబడి వెండి
కరమొప్పు నీపాట నాలు
గణముల మధ్యాక్కరంబు

విరచింపఁ బ్రాఁతళ్ళు నిట్లు
వెలయుఁ గవిజనాశ్రయుండ. 29

(భీమన ఛందము)

మధ్యాక్కరకు నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను మొదట రెండింద్ర గణములు, నొక సూర్యగణము, మరల రెండింద్ర గణములు నొక సూర్యగణము నుండవలయును. ప్రతిపాదమునకు మొదటి యక్షరమునకును నాల్గవగణము మొదటి యక్షరమునకును యతిమైత్రి చెల్లవలయును.

| 1. ఇంద్ర | 2. ఇంద్ర | 3. సూర్య |
|---|---|---|
| స ల | న గ | హ |
| I I U I | I I I U | U I |
| సురరాజ | యుగముతోఁ | గూడి |

| 4. ఇంద్ర | | |
|---|---|---|
| ర | న ల | |
| U I U | I I I I | U I |
| సూర్యుతో | నొడబడి | యుండి |

పయి పాదమున రెండింద్ర గణములు, నొక సూర్యగణము, మరల రెండింద్ర గణములు నొక సూర్యగణము నున్నవి.

మొదటి యక్షరమునకును, నాల్గవ గణము మొదటి యక్షరమునకును యతి మైత్రి చెల్లినది. (సు - సూ)

ఇది యిట్లుండ, నన్నయభట్టు మధ్యాక్కరలో మొదటి యక్షరమునకును అయిదవ గణము మొదటి యక్షరమునకును యతిమైత్రి చెల్లించుట గమనింపదగియున్నది.

కడఁగి నోచితినిగాకేమి యనుచును గందె డెందమున.

ఆది.చ. 103

## ఆటవెలఁది - తేటగీతి

ఆ. ఇనగణత్రయంబు / నింద్ర ద్వయంబును
హంసపంచకంబు / నాట వెలఁది
సూర్యుఁ డొక్కరుండు / సురరాజు లిద్దఱు
దినకరద్వయంబు / తేటగీతి 30

ఆటవెలఁది పద్యములో మొదటి, మూఁడవ పాదములొక విధము గను, రెండవ నాల్గవపాదము లొకవిధముగను నుండును. మొదటి, మూడవ పాదములలో మూఁడు సూర్యగణములు, రెండింద్రగణములు నుండును. రెండవ, నాల్గవపాదములలో నైదు సూర్యగణములుండును. ప్రతిపాదము నను మొదటి యక్షరమునకును, నాల్గవ గణము మొదటి యక్షరమునకును యతిమైత్రి చెల్లవలయును. ప్రాసనియమములేదు. యతిమైత్రి చెల్లనిచోఁ బ్రాసయతి చెల్లింపవచ్చును.

మొదటి పాదము

| సూర్య | సూర్య | సూర్య | ఇంద్ర | ఇంద్ర |
|---|---|---|---|---|
| న | హ | హ | త | భ |
| III | UI | UI | UUI | UII |
| ఇనగ | ణత్ర | యంబు | నింద్రద్వ | యంబును |

రెండవపాదము

| సూర్య | సూర్య | సూర్య | సూర్య | సూర్య |
|---|---|---|---|---|
| హ | హ | హ | హ | న |
| UI | UI | UI | UI | III |
| హంస | పంచ | కంబు | నాట | వెలఁది |

ఇందు మొదటిపాదమున మూఁడు సూర్యగణములు, రెండింద్ర గణములు గలవు. రెండవపాదమున నైదు సూర్యగణములు గలవు. రెండు పాదములందును మొదటి గణము మొదటి యక్షరమునకును, నాల్గవగణము మొదటి యక్షరమునకును యతి మైత్రి చెల్లినది. మొదటిపాదము ఇ-ఇం, రెండవపాదము హం-ఆ.

తేటగీతి పద్యములోఁ బ్రతి పాదమునను ఒక సూర్య గణము, రెండింద్రగణములు మరల రెండు సూర్యగణములు నుండును. మొదటి గణము మొదటి యక్షరమునకు నాల్గవగణము మొదటి యక్షరమునకును యతిమైత్రి చెల్లవలయును. యతికి బదులుగాఁ బ్రాసయతి చెల్లవచ్చును.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| సూర్య | ఇంద్ర | ఇంద్ర | సూర్య | సూర్య |
| హ | త | సల | హ | న |
| UI | UUI | I IUI | U I | I I I |
| ఐహి | కాముష్మి | కసుఖంబు | లందు | నరుఁడు |

ఇందు మొదట నొక సూర్యగణమును, తరువాత రెండింద్రగణములును, తరువాత రెండు సూర్యగణములును గలవు. మొదటి గణము మొదటి యక్షరమునకును, నాల్గవగణము మొదటి యక్షరమునకును ఐ-అం యతిమైత్రి చెల్లినది.

## ప్రాసయతి కుదాహరణము

ఆటవెలఁది- ఆటవెలఁదియైనఁ దేట గీతియునైన

ఇందు యతిమైత్రి చెల్లలేదు. యతికిఁ బ్రక్కనున్న యక్షరమునకును, మిత్ర స్థానమునకుఁ బ్రక్కనున్న యక్షరమునకు బ్రాసమైత్రి చెల్లినది. దీనికే ప్రాసయతి అనిపేరు. ఆట-దేట

తేటగీతి - మొదలఁ జూచినఁ గడుగొప్ప పిద పఁగుఱచ

ఇందు యతిమైత్రి చెల్లలేదు. యతికిఁ బ్రక్కనున్న యక్షరమునకును, మిత్రస్థానమునకుఁ బ్రక్కనున్న యక్షరమునకును బ్రాసమైత్రి చెల్లినది. మొద—పిద దీనికే ప్రాసయతి అని పేరు.

## సీసపద్యము

ఇంద్రగణము లాఱు § నినగణంబులు రెండు
పాదపాదమునకు § బరఁగుచుండు
అట వెలఁదియైనఁ § దేటగీతియైనఁ
జెప్పవలయు మీఁద § సీసములకు. 31

సీసపద్యమున నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను ఎనిమిది గణములుండును. వానిలో మొదటి ఆఱును ఇంద్రగణములు. తరువాతి రెండును సూర్యగణములు. మొదటి గణము మొదటి యక్షరమునకును, మూఁడవ గణము మొదటి యక్షరమునకును, ఒక యతియు, అయిదవ గణము మొదటి యక్షరమునకును ఏడవ గణము మొదటియక్షరమునకును మఱియొక యతియుఁగూర్ప వలయును. యతి మైత్రి చెల్లనిచోఁ బ్రాసయతిని జెల్లింపవచ్చును. ఇట్లు నాలుగు పాదములు చెప్పిన తరువాత ఆటవెలఁదిని గాని, తేటగీతినిగాని చెప్పవలయును.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర | ఇంద్ర |
| భ | నల | నగ | నల |
| U I I | I I U I | I I I U | I I U I |
| ఇంద్రగ | ణములారు | నినగణం | బులురెండు |

| 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|
| ఇంద్ర | ఇంద్ర | సూర్య | సూర్య |
| ర | నల | న | హ |
| U I U | I I I I | I I I | U I |
| పాదపా | దమునను | బరఁగు | చుండు |

ఇందు పాదమున ఆఱింద్రగణములు, రెండు సూర్యగణములు మొత్తము ఎనిమిది గణములు గలవు. మొదటి గణము మొదటియక్షర మునకును మూఁడవ గణము మొదటియక్షరమునకును ఇం-ఇ, యతిమైత్రి చెల్లినది. మరల అయిదవగణము మొదటియక్షరమునకు పా-బా యతిమైత్రి చెల్లినది.

## ద్విపదాదుల విశ్రమస్థానములు

ఆ. ద్విపద సీసములకు-విశ్రాంతి రెంటిపై,
నెలమి గీత కంద కే ములకు మూఁటి
కడలఁ యతులు, నాల్గుకగణములమీఁదను
త్సాహమునకు నిరతి.కసారసౌక్ష! 32

ద్విపదకును, సీసమునకును రెండేసి గణములపై యతి మిత్ర స్థానము అనఁగా మూఁడవ గణము మొదటి యక్షరమునకు యతిమైత్రి చెల్లవలయును. తేటగీతికిని,ఆటవెలఁదికిని,కందమునకును మూఁడుగణము లపై యతిమిత్రస్థానము. అనఁగా నాల్గవగణము మొదటి యక్షరముతో యతిమైత్రి. ఉత్సాహమునకు నాల్గు గణములపై యతిమైత్రి అనఁగా అయి దవ గణము మొదటి యక్షరముతో యతిమైత్రి చెల్లవలయును.

# వృత్తములు

ఇరువదియాఱు ఛందములును, వానియందుఁబుట్టిన వృత్తములును ఇప్పుడు చెప్పఁబడుచున్నవి.

క. సమవృత్తములఁ జతుష్పా
దములం దొక్కొక్క యక్షరము హెచ్చఁగా బెరుఁగన్
గ్రమముగ గణాక్షరంబులు
సమమౌ మఱి యిరువదాఱు ఛందంబులకున్. 33

(భీమన ఛందము)

ఛందము లిరువది యాఱు. మొదటి ఛందము నుండి ఒక్కొక్క ఛందమున ననేక సమవృత్తములు పుట్టుచున్నవి. వృత్తమునకు నాలుగు పాదములుండును. మొదటి పాదమున కెన్ని అక్షరములుండునో తక్కిన మూఁడు పాదములందును అన్ని అక్షరములే యుండును. ఇట్టి వానికి సమవృత్తము అని పేరు. సమవృత్తమునందు ఒక పాదమున కెన్ని యక్షరములు గలవో, ఆ వృత్తమన్నవ ఛందమునఁ బుట్టినదని యెఱుఁగ వలయును. మొదటి ఛందమున నొక్క యక్షరము గల వృత్తము, రెండవ ఛందమున రెండక్షరముల వృత్తములు, మూఁడవ ఛందమున మూఁడక్షరముల వృత్తములు. ఇట్లే ఒక్కొక్క అక్షరముగాఁ బెరుఁగుచు వచ్చును.

## ఇరువదియాఱు ఛందములు

| ఛందస్సు సంఖ్య | ఛందస్సుల పేర్లు | పాదమునకెన్ని యక్షరములు | వానియందు బుట్టిన వృత్తముల సంఖ్య |
|---|---|---|---|
| 1 | ఉక్త | 1 | 2 |
| 2 | అత్యుక్త | 2 | 4 |
| 3 | మధ్య | 3 | 8 |
| 4 | ప్రతిష్ఠ | 4 | 16 |
| 5 | సుప్రతిష్ఠ | 5 | 32 |
| 6 | గాయత్రి | 6 | 64 |
| 7 | ఉష్ణిక్కు | 7 | 128 |
| 8 | అనుష్టుప్పు | 8 | 256 |
| 9 | బృహతి | 9 | 512 |
| 10 | పంక్తి | 10 | 1024 |
| 11 | త్రిష్టుప్పు | 11 | 2048 |
| 12 | జగతి | 12 | 4096 |
| 13 | అతిజగతి | 13 | 8192 |

| | | | |
|---|---|---|---|
| 14 | శక్వరి | 14 | 16384 |
| 15 | అతిశక్వరి | 15 | 32768 |
| 16 | అష్టి | 16 | 65536 |
| 17 | అత్యష్టి | 17 | 131072 |
| 18 | ధృతి | 18 | 262144 |
| 19 | అతిధృతి | 19 | 524288 |
| 20 | కృతి | 20 | 1048576 |
| 21 | ప్రకృతి | 21 | 2097152 |
| 22 | ఆకృతి | 22 | 4194304 |
| 23 | వికృతి | 23 | 8388608 |
| 24 | సుకృతి | 24 | 16777216 |
| 25 | అభికృతి | 25 | 33554432 |
| 26 | ఉత్కృతి | 26 | 67108864 |
| | ఇరువదియాఱు ఛందములతోఁ బుట్టిన వృత్తముల సంఖ్య మొత్తం | | 184217726 |

ఇరువదియాఱు ఛందములలోఁ గోట్ల కొలది వృత్తములు పుట్టు చున్నను ఛందఃకర్తలు 200 వృత్తములకంటె నెక్కువ చెప్పలేదు. వీనిలో 50 కంటె నెక్కువ వృత్త భేదములు ప్రయోగింపబడలేదు. ఈ గ్రంథమునఁ బ్రాచీన కవులుపయోగించిన ప్రసిద్ధ వృత్తములు సుమారు 50 మాత్రము చెప్పబడినవి. ఇందలి వృత్తములు ఛందఃక్రమమునఁ జూడఁబడలేదు. అక్షర సంఖ్యను బట్టియే ఛందమో తెలిసికొన వలయును.

సమవృత్తములో నాలుగు పాదములలోను అక్షర సంఖ్య, గణముల క్రమము, యతిస్థానము సమానముగా నుండును. నాలుగు పాదములలోను ద్వితీయాక్షరము (ప్రాసము) నియతముగా నుండును.

## ఉత్పలమాల వృత్తము

భానుసమాన! విన్; భరన
భారలగంబులఁగూడి విశ్రమ
స్థానమునందుఁ బద్మజయు
తంబుగ నుత్పలమాలరైచనున్. 34

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను భ,ర,న,భ,భ,ర,వ అనుగణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, పదియవ యక్షరమునకును యతి మైత్రి, ప్రాసనియమము గలదు.

| భ | ర | న | భ |
|---|---|---|---|
| U I I | U I U | I I I | U I I |
| భాను స | మాన విన్ | భరన | భా ర ల |

| భ | ర | వ |
|---|---|---|
| U I I | U I U | I U |
| గంబులఁ | గూడి వి | శ్రమ (స్థా) |

భా = భ, భ. లగ = వ పద్మజ యుతంబుగన్ = బ్రహ్మతోఁ గూడుకొనునట్లు, బ్రహ్మలు తొమ్మండ్రు గావున తొమ్మిది యక్షరములపై - అనఁగా పదియవ యక్షరము యతిమిత్ర స్థానము. విశ్రమ స్థానము = యతి స్థానము.

## చంపక మాలావృత్తము

నజభజజల్ జ రేఫలఁ బె
 నంగి దిశాయతి తోడఁ గూడినన్
త్రిజగ దభీష్టదా! బుధని
 కీ! విను, చంపకమాలయై చనున్. 35

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను న,జ,భ,జ,జ,జ,ర అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, పదునొకొండవ అక్షరమునకు యతిమైత్రి, ప్రాసనియమము గలదు.

| న | జ | భ | జ |
|---|---|---|---|
| I I I | I U I | U I I | I U I |
| న జ భ | జ జల్ జ | రేఫలఁ | బెనంగి |

| జ | జ | ర |
|---|---|---|
| I U I | I U I | U I U |
| దిశాయ | తి తోడఁ | గూడినన్ |

పెనంగి = కూడి. దిశాయతి - దిశలు పది కావున పదియవ అక్షరముపై అనఁగా పదునొకొండవ యక్షరము యతిమిత్ర స్థానము.

### శార్దూల విక్రీడిత వృత్తము

సారాచార విశారదా! యినయతిన్
శ్శార్దూల విక్రీడితా
కారంబై మసజమ్ములిమ్ముగ నతా
గప్రాప్తమై చెల్వగున్. 36

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను మ,స,జ,స,త,త,గ అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, పదమూఁడవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

ఇన యతి = సూర్యయతి. సూర్యులు పండ్రెండుగురుగావున పండ్రెండవ యక్షరముపై అనఁగా పదమూఁడవ యక్షరము యతిమిత్ర స్థానము. మస జమ్మునతాగ ప్రాప్తమై మ,స,జ,స,త,త,గ. తా = త,త.

| మ | స | జ | స | త | త | గ |
|---|---|---|---|---|---|---|
| U U U | I I U | I U I | I I U | U U I | U U I | U |
| సారాచా | ర విశా | రదా యి | న యతిన్ | శార్దూల | విక్రీడి | తా |

### మత్తేభ విక్రీడిత వృత్తము

స్మయదురా! విలసత్త్రయోదశయతిన్
మత్తేభ విక్రీడితా
వ్యాయమమ్యోన్ సభరంబులున్ నమయవ
వ్రాతంబులుం గూడఁగాన్ 37

(భీమన ఛందము)

నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను స, భ, ర, న, మ య, వ అనుగణములు క్రమముగా నుండవలయును, మొదటి యక్షరమునకును, పదునాల్గవ యక్షరమునకునుయతిమైత్రి. ప్రాసనియమము గలదు.

త్రయోదశయతి — పదమూడవ యక్షరముపై - అనఁగా పదు నాల్గవ అక్షరము యతిమిత్రస్థానము.

| స | భ | ర | న |
|---|---|---|---|
| I I U | U I I | U I U | I I I |
| స్మయదూ | రా విల | స త్రియో | దశ య |

| మ | య | వ |
|---|---|---|
| U U U | I U U | I U |
| తిన్ మ త్తే | భ విక్రీ | డి తా |

## మత్తకోకిల వృత్తము

శ్రావకాభరణాంక! విన్, రస
జాభరేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల
మంద్రుదీనిఁ గవీశ్వరుల్ 38

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను ర, స, జ, జ, భ, ర అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, పదునొకండవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియతము గలదు.

ర స జా భ రే ఫ లు — ర, స, జ, జ, భ, ర. దిగ్విరామము = దిక్కులు పది కావున పది యక్షరములపై — అనఁగా పదునొకండవ యక్షరము యతి మిత్ర స్థానము.

| ర | స | జ | జ | భ | ర |
|---|---|---|---|---|---|
| U I U | I I U | I U I | I U I | U I I | U I U |
| శ్రావకా | భరణాం | క విన్ ర | స జా భ | రే ఫల | దిగ్విరా |

## ధ్రువకోకిల వృత్తము (తరలము)

శుభవిలాస! ముకుంద! కేశవ!
శూలిభవ్య విరామమున్
న, భ, ర, సంబులు, జాగముల్ దగు
నవ్యమై ధ్రువకోకిలన్. 39

నాలుగు పాదములుండును. ప్రతి పాదమునకు న, భ, ర, స, జ, జ, గ అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును పండ్రెండవ యక్షరమునకును యతి మైత్రి. ప్రాసనియమము గలదు.

శూలి = రుద్రుఁడు. రుద్రులు పదునొకండుగురు కావున పదునొకండవ యక్షరముపై అనఁగా పండ్రెండవ యక్షరము యతిమిత్రస్థానము. ధ్రువకోకిలమునే తరలమనియు నందురు.

| న | భ | ర | స | జ | జ | గ |
|---|---|---|---|---|---|---|
| I I I | U I I | U I U | I I U | I U I | I U I | U |
| శుభ వి | లాస ము | కుంద కే | శవ శూ | లి భవ్య | విరామ | మున్ |

## పృథ్వీ వృత్తము

త్రయోదశయతిన్ గృతిన్ జ,స,జ,సల్, జ
తంబై య, వల్
దయాజలనిధీ! చెలంగు విను పృథ్వి
ధాత్రిం దగన్ 40

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను జ, స, జ, స, య, వ అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, పదునాల్గవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| జ | స | జ | స | య | వ |
| I U I | I I U | I U I | I I U | I U U | I U |
| త్రయోద | శ యతిన్ | గృతిన్ జ | స జ సల్ | జ తం బై | య వల్ |

ఈ గ్రంథమున పృధ్వికి 14 వ యక్షరము యతిమిత్రస్థానముగా నిర్దేశింపబడినది. కాని యితర లాక్షణికు లందఱును పండ్రెండవ యక్షరమును యతిమిత్ర స్థానముగా నిర్దేశించిరి. 9వ అక్షరమును యతిమిత్ర స్థానముగా ఎఱ్ఱన, శ్రీనాధుఁడు, పెద్దన మున్నగు కవులు ప్రయోగించిరి. నన్నయ 12వ యక్షరమును చాటించెను. 14వ అక్షరమునకు లక్ష్యము గానరాదు.

శ్రీనాధుఁడు 9వ యక్షరమును చాటించెననుటకు-

1 9

చతుర్ముఖ విలాసినీ శ యవిలాస పంకేరుహా- నైష

నన్నయ 12వ యక్షరమును చాటించెననుటకు-

1 12

అ మిత్ర మదభేది యొక్కరుఁడ యమ్మృగాన్వేషణ

## సరసాంక వృత్తము

సరసాంక వృత్తమమరుఁ గ్రన,జ,సా,య లొందఁ  
సరసీజ సంభవయతిఁ గ్రజలజాత నేత్రా! 41

నాలుగు పాదము లుండును. ప్రతి పాదమునకు స, జ, స, స, య - అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకు పదియవ యక్షరమునకు యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

సరసీజ సంభవ యతి - బ్రహ్మయతి - బ్రహ్మలు తొమ్మండ్రు కావున తొమ్మిది యక్షరములపై - అనఁగా పదియవ యక్షరము యతి మిత్రస్థానము. సా = స, స.

| స | జ | స | స | య |
|---|---|---|---|---|
| I I U | I U I | I I U | I I U | I U U |
| స రసాం | కవృత్త | మమరున్ | స జసా | య లొందన్ |

స్రగ్ధరా వృత్తము

శ్రీమన్మూర్తీ మకారా

శ్రిత ర,భ,న,య,యా శ్రేసేవ్యమై సానుమద్వి

శ్రామంబుఃసానుమద్వి

శ్రీమము నమరఁగా స్రగ్ధరావృత్తమయ్యె.42

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునకు మ, ర, భ, న, య, య, య - అనుగణములు క్రమముగా నుంతవలయును. మొదటి యక్షరమునకు, ఎనిమిదవ అక్షరమునకును, మరల 15వ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| మ | ర | భ | న | య |
|---|---|---|---|---|
| U U U | U I U | U I I | I I I | I U U |
| శ్రీమన్మూ | ర్తీ మకా | రా శ్రి త | ర భ న | య యా సే |
| 1 | | 8 | | 15 |

| య | య |
|---|---|
| I U U | I U U |
| వ్యమైసా | ను మద్వి (శ్రా) |

సానుమద్వి శ్రీమము = సానుమంతమనఁగాఁ గొండ. కొండలు ఏడు. ఏడక్షరములపై - అనఁగా ఎనిమిదవ అక్షరమును, అటనుండి మరల ఏడక్షరములపై అనఁగా ఎనిమిదవ అక్షరమును - అనఁగా 15వ అక్షరమును యతిమిత్ర స్థానములు.

## మహాస్రగ్ధరావృత్తము

లనదుద్యత్కీర్తి వల్లీ ! లలితగుణగణా
! లంకృతాంగా స, తా, న
స్థ,స, రా,గంబు ల్మహాస్ర ! గ్ధరకు వసుముని
! స్థానవిశ్రాంతులొప్పన్. 43

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను స,త,త,న,స,ర,ర,గ-అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, తొమ్మిదవ యక్షరమునకును మరల 16వ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

తా=త,త, రా = ర, ర వసు మునిస్థాన విశ్రాంతులు వసు = అష్ట వసువులు అనగా ఎనిమిదవ అక్షరముపై - అనగా 9వ 'అక్షరము యతి మిత్రస్థానము మరల నటనుండి ముని = సప్తమునులు, ఏడవ అక్షర ముపై అనగా 8వ యక్షరము-అనగా 16 వ అక్షరము యతిమిత్ర స్థానము.

| స | త | త | న | స | ర | ర | గ |
|---|---|---|---|---|---|---|---|
| I I U | UU I | UU I | I I I | II U | UIU | UIU | U |
| లన దు | ద్యత్కీర్తి | వల్లీ ల | లిత గు | ణ గణా | లంకృతాం | గా సతా | న(స్థ) |
| 1 | | 9 | | 16 | | | |

## స్రగ్విణీవృత్తము

వాగ్వధూవల్లభా ! వార్ధి రేఫావళిన్
స్రగ్విణీవృత్త వి ! శ్రాంతి యాఱింటిపై 44

(భీమన ఛందము)

నాలుగు పాదములు లుండును. ప్రతిపాదమునను నాలుగు రగణము లుండవలయును. మొదటి యక్షరమునకును ఏడవ యక్షరమునకును యతి మైత్రి, ప్రాసనియమము గలదు.

వార్ధి = సముద్రము ఇవి నాలుగు గావున వార్ధిరేఫావళి అనఁగా నాలుగు రగణములు

| ర | ర | ర | ర |
|---|---|---|---|
| U I U | U I U | U I U | U I U |
| వాగ్వధూ | వల్లభా | వార్ధి రే | ఫావళిన్ |
| 1 | | 7 | |

## భుజంగ ప్రయాతవృత్తము

జగద్గీతకీర్తి! భుజంగ ప్రయాతం
బగున్ రేచనా! యద్వయద్వంద్వమైనన్. 45

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను నాలుగు యగణము లుండును మొదటి యక్షరమునకును, ఎనిమిదవ యక్షరమునకును యతి మైత్రి (లక్షణపద్యములో యతిమిత్రస్థానము చెప్పబడలేదు) ప్రాసనియమము గలదు.

| య | య | య | య |
|---|---|---|---|
| I U U | I U U | I U U | I U U |
| జగద్గీ | తకీర్తి | భుజంగ | ప్రయాతం |
| 1 | | 8 | |

యద్వయద్వంద్వము = 4య గణములు

## తోదక వృత్తము

శ్రీయుతభత్రయ ‡ సేవ్యగగంబుల్
తోయజలోచన! ‡ తోదకమయ్యెన్ 46

(భీమన ఛందము)

నాలుగు పాదములుండవలయును ప్రతి పాదమునను మూఁడు భగణముల మీద రెండు గురువు లుండును. మొదటి యక్షరమునకు ఏడవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు. (దీనికిని లక్షణపద్యమున యతిమైత్రి చెప్పఁబడలేదు.)

| భ | భ | భ | గ | గ |
|---|---|---|---|---|
| U I I | U I I | U I I | U | U |
| శ్రీయుత | భత్రయ | సేవ్యగ | గం | బుల్ |
| 1 | | 7 | | |

దీనినే తోదకవృత్తమని అనంతుఁడనెను. పాదప వృత్తమను నామాంతరమును గలదు.

## పాదపవృత్తము

పాదపవృత్తము ‡ భా భగగంబుల్
మోదముతో నిరు ‡ మూఁటవిరామన్ 47

దీనికి లక్షణము తోదక వృత్తమునకు వలెనే యుండును.

| భ | భ | భ | గ | గ |
|---|---|---|---|---|
| U I I | U I I | U I I | U | U |
| పాదప | వృత్తము | భా భగ | గం | బుల్ |
| 1 | | 7 | | |

7)

## తోటకవృత్తము

తుదిదాఁక సకారచ ౹ తుష్కముగా
విదితంబుగఁ దోటక ౹ వృత్తమగున్. 48

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునకు నాలుగు సగణము లుండవలయును. మొదటి అక్షరమునకును తొమ్మిదవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు. ఇందును యతిమైత్రి చెప్పబడ లేదు.

| స | స | స | స |
|---|---|---|---|
| I I U | I I U | I I U | I I U |
| తుది దాఁ | క సకా | ర చ తు | ష్కముగా |
| 1 | | 9 | |

## తోదక వృత్తము

జలరుహావక్త్రి! న, ౹ జా, యగణంబుల్
వెలయఁగఁ దోదక ౹ వృత్తముఁ జెప్పన్. 49

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను న,జ,జ,య గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును ఎనిమిదవ యక్షర మునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| న | జ | జ | య |
|---|---|---|---|
| I I I | I U I | I U I | I U U |
| జలరు | హ వక్త్రి | న జా య | గణంబుల్ |
| 1 | | 8 | |

౹ = జ, జ.

## వసంత తిలక వృత్తము

సారంబుగా త, భ, జ, జంబు వసంతరాజా
కారా! వసంత తిలకంబగు గాయుతంబై. 50

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను త,భ,జ,జ,గ,గ అను గణములుండును. మొదటి యక్షరమునకును, ఎనిమిదవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| త | భ | జ | జ | గ | గ |
|---|---|---|---|---|---|
| U U I | U I I | I U I | I U I | U | U |
| సారంబు | గా తభ | జ జంబు | వసంత | రా | జా |
| 1 | | 8 | | | |

గా యుతంబై -గ గ ముతోఁ గూడినదై.

## మదన వృత్తము

దైతేయభంజన! హరీ! తభ, జా, గగంబుల్
పూతంగ విక్రమముల మదనాఖ్యయొప్పున్. 51

నాలుగుపాదములుండును. ప్రతిపాదమునను త, భ, జ, జ, గగ అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును తొమ్మిదవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు. మదనమునకును, వసంతతిలకమునకును గణము లొక విధముగనే యుండును. కాని యతిమైత్రిలో భేదము గలదు. వసంత తిలకమున యతిమిత్ర స్థానము 8వ అక్షరము కాఁగా, మదనమునకు 9వ అక్షరము.

| త | భ | జ | జ | గ | గ |
|---|---|---|---|---|---|
| U U I | U I I | I U I | I U I | U | U |
| దైతేయ | భంజన | హరీ త | భజాగ | గం | బుల్ |
| 9 | | 9 | | | |

మాతంగ విశ్రమము — మాతంగమనఁగా ఏనుఁగు. అవి ఎనిమిది. కావున ఎనిమిది యక్షరములపై - అనఁగా తొమ్మిదవ యక్షరము యతిమైత్రి స్థానము.

## పంచచామర వృత్తము

జరల్ జరల్ జగంబుఁగూడ సన్నుతిన్ రచింపఁగాఁ
బరాజితారిధీరవీర! పంచచామరంబగున్ 52

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను, జ, ర, జ, ర, జ, గ అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, పదియవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| I U I | U I U | I U I | U I U | I U I | U |
| జరల్ జ | రల్ జగం | బుఁ గూడ | సన్నుతిన్ | రచింపగాఁ | గా |
| 1 | | | 10 | | |

## సుగంధి వృత్తము

ఏడుహామ్ములున్గమున్ వ డెన్మిదిన్ సుగంధికిన్ 53

(చిత్రకవి పెద్దన)

నాలుగు పాదములుండును. ప్రతి పాదమునను ఏడు హ గణములును, ఒక గురువు నుండవలయును. యతిమైత్రి మొదటి యక్షరమునకును తొమ్మిదవ యక్షరమునకును ప్రాసనియమము గలదు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| హ | హ | హ | హ | హ | హ | హ | గ |
| U I | U I | U I | U I | U I | U I | U I | U |
| ఏడు | హామ్మ | లున్ గ | మున్ వ | డెన్మి | దిన్ సు | గంధి | కిన్ |
| 1 | | | | 9 | | | |

వడి = యతి. వడెన్మిదిన్ = వడి+ఎన్మిదిన్.

## తరళ వృత్తము

న, న, న, న, న, న, న, గము లెలమి
నలినహితవిరమణతన్
దనరి తరళ మనఁగ వెలయు
ధరణి మదన మదహరా 54

నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను వరుసగా ఏడు నగణములును, వానిపై నొక గురువు నుండవలయును మొదటయక్షరము నకును, పదమూఁడవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

నలినహిత విరమణతన్ = నలినహితుఁడు సూర్యుడు. సూర్యులు పండ్రెండుగురు. పండ్రెం డక్షరములపై - అనఁగా పదమూఁడవ యక్షరము యతిమైత్రి.

| | | | |
|---|---|---|---|
| న | న | న | న |
| I I I | I I I | I I I | I I I |
| తనర<br>1 | తరళ | మనఁగ | వెలయు |
| న | న | న | గ |
| I I I | I I I | I I I | U |
| ధరణి<br>13 | మదన | మదహ | రా |

అప్పకవీయమున దీనికి విచికిలిత అనుపేరు గలదు.

## మాలినీ వృత్తము

న, న, మ, య, య యుతంబై నాగవిక్రాంతమై యి
ట్లనుపమగుణ! మాలినీ వ్యాహ్వయంబయ్యె ధాత్రిన్ 55

(భీమన ఛందము)

నాలుగుపాదము లుండును. ప్రతిపాదమునకు న, న, మ, య, య అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, తొమ్మిదవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| న | న | మ | య | య |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | IU U |
| నన మ | య య యు | తంబై నా | గ విక్రాం | తమై యి (ట్ల) |
| 1 | | 9 | | |

నాగ విక్రాంతము-నాగ మనఁగా నేనుఁగు ఏనుగులు ఎనిమిది, ఎనిమిది యక్షరములపై అనఁగా తొమ్మిదవ యక్షరము యతిమిత్ర స్థానము.

## మానినీ వృత్తము

కారకముల్ క్రియ గన్గొన నేను భ
 కారము లోకగ కారముతో
గారవమై చనఁ గా తగులన్నియుఁ
 గల్గిన మానిని కామనిభా! 56

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను ఏడుభగణములును, గురువు నుండవలయును. మొదటి యక్షరమునకును ఏడవ, పదమూ పందొమ్మిదవ అక్షరములకును యతిమైత్రి. ప్రాసనియమముగలదు.

| భ | భ | భ | భ |
|---|---|---|---|
| UII | UII | UII | UII |
| కారక | ముల్ క్రియ | గన్గొన | నేడు భ |
| 1 | | 7 | |

| భ | భ | భ | గ |
|---|---|---|---|
| UII | UII | UII | U |
| కారము | లొక్క గ | కారము | తో |
| 13 | | 19 | |

## కవిరాజ విరాజితము

క్రమమున నొక్క న కారము నాఱు జ
కారములుం బరఁ గంగ నకా
రమును నొడంబడి కాఁ గవిరాజ వి
రాజిత మన్నది రామనిభా! 57

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను ఒక నగణమును, దానిపై ఆరు జగణములును, తరువాత నొక వ గణము నుండవలయును. మొదటి అక్షరమునకును, ఎనిమిదవ అక్షరమునకును, పదునాల్గవ అక్షర మునకును, ఇరువదియవ యక్షరమునకును యతిమైత్రి....ప్రాసనియమము గలదు.

| న | జ | జ | జ |
|---|---|---|---|
| III | IUI | IUI | IUI |
| క్రమము | న నొక్క | న కార | ము నాఱు |
| 1 | | 8 | |

| జ | జ | జ | వ |
|---|---|---|---|
| I U I | I U I | I U I | I U |
| జ కార | ములుం బి | రఁ గంగ | నకా |
| 14 | | 20 | |

## తరలి వృత్తము

చారు భ, స, న, భూరి జ, న, ర, సాంద్రగణములన్
సార వితతి నందముగ నిజాబు తరలి చెన్నగున్ 58

నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను భ, స, న, జ, న, ర అను గణములు క్రమముగా నుండును. మొదటి అక్షరమునకును, పదు నొకొండవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| భ | స | న | జ | న | ర |
|---|---|---|---|---|---|
| U I I | I I U | I I I | I U I | I I I | U I U |
| చారు భ | సన భూ | రి జన | ర సాంద్ర | గణము | లన్ దిశా |
| 1 | | | 11 | | |

## శిఖరిణీ వృత్తము

పురారతి న్పర్థీ! యమనసభవంబు లొప్పెసఁగి సుం
దరంబై నన్ రేఖా! శిఖరిణియగున్ ద్వాదశయతిన్. 59

(భీమన ఛందము)

నాలుగుపాదము లుండును. ప్రతిపాదమునను య, మ, న, స, భ, వ అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, పదుమూఁడవ యక్షరమునకును యతి మైత్రి. ప్రాసనియమము గలదు.

| య | మ | న | స | భ | వ |
|---|---|---|---|---|---|
| I U U | U U U | I I I | I I U | U I I | I U |
| పురారా | తి స్పర్ధీ | యమన | సభవం | బు ల్పెనఁ | గి సుం |
| 1 | | | | 13 | |

## ఇంద్రవజ్రావృత్తము

ఇత్తా, జ, గా సంగతి నింద్రవజ్రా
వృత్తంబగున్ సన్నుత - వృత్తరేచా! 60

(భీమన చందము)

నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను త, త, జ, గ గ అను గణము లుండవలయును. మొదటి యక్షరమునకును, ఎనిమిదవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| త | త | జ | గ గ |
|---|---|---|---|
| U U I | U U I | I U I | U U |
| ఇత్తా జ | గా సంగ | తి నింద్ర | వజ్రా |
| 1 | | 8 | |

## ఉపేంద్రవజ్రావృత్తము

నపద్మ పద్మా! జత జల్గగంబున్
ఉపేంద్ర వజ్రాఖ్యము నొప్పుఁజెప్పన్ 61

(భీమన ఛందము)

నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను జ, త, జ, గ గ అను గణములు క్రమముగా నుండవలయును. మొదటి యక్షరమునకును, ఎనిమిదవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| జ | త | జ | గ గ |
|---|---|---|---|
| I U I | U U I | I U I | U U |
| న పద్మ | పద్మాజ | త జ ల్గ | గంబున్ |
| 1 | | 8 | |

## ఉపజాతి వృత్తము

ఈ రెండు వృత్తంబులు కి నిందుఁగూడన్
సరోజనేత్రా! యుప జాతి యయ్యేన్. 62

(భీమన ఛందము)

ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర అను రెండు వృత్తములు గూడునది ఉపజాతి యనఁబడును. ఇందు మొదటి పాదమున 'ఇంద్రవజ్రా' లక్షణమును (త,త,జ,గగ-గణములు), రెండవ పాదమున ఉపేంద్రవజ్రా లక్షణమును (జ,త,జ,గగ-గణములు), మొదటి పాదమువలె మూఁడవ పాదమును, రెండవ పాదమువలె నాల్గవ పాదమును నుండును.

| | త | త | జ | గ గ |
|---|---|---|---|---|
| | U U I | U U I | I U I | U U |
| ఉదా : | ఈ రెండు | వృత్తంబు | లు నిందుఁ | గూడన్ |

| జ | త | జ | గ గ |
|---|---|---|---|
| I U I | U U I | I U I | U U |
| సరోజ | నేత్రా! యు | పజాతి | యయ్యేన్ |

ఇందు మొదటి పాదము త,త,జ,గగ గణములు గలిగి, 8వ అక్షరము యతిమైత్రి గలిగి ఇంద్రవజ్రా లక్షణము గలిగియున్నది.

రెండవ పాదము జ,త,జ,గగ-గణములు గలిగి 8వ అక్షరము యతిమైత్రి గలిగి ఉపేంద్ర వజ్రా లక్షణము గలిగియున్నది.

ప్రాసనియమము గలదు.

## మందాక్రాంతా వృత్తము

కాంతా కాంతా! మభనతతగా
కి కాంతి సంక్రాంతి మందా

క్రాంతంబయ్యెన్ విరతిదశమా
కక్రాంతి విక్రాంతమైనన్. 63

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను క్రమముగా మ,భ, న,త,త,గ-అను గణములుండవలయును. మొదటి యక్షరమునకును, ఐదునొకొండవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| | మ | భ | న | త | త | గగ |
|---|---|---|---|---|---|---|
| ఉదా : | U U U | U I I | I I I | U U I | U U I | U U |
| | కాంతా కాం | తా మ భ | నతత | గా క్రాంతి | సంక్రాంతి | మందా |

## రథోద్ధత వృత్తము

నందితప్రియతరకనంబుపై రవం
బొంది వచ్చిన రథోద్ధతంబగున్. 64

(భీమన ఛందము)

రథోద్ధత వృత్తమున నాలుగు పాదములుండును ప్రతిపాదమునను వరుసగా ర,న,ర,వ అను గణములుండును. మొదటి యక్షరమునకును, ఏడవ యక్షరమునకును యతిమైత్రి ప్రాసనియమము గలదు.

| ర | న | ర | వ |
|---|---|---|---|
| U I U | I I I | U I U | I U |
| నందిత | ప్రియతర | నంబుపై | రవం |

## స్వాగత వృత్తము

స్వాగతంబగు లక సద్గుణ లక్ష్మి
భాగధేయ! ర, న, క భల్, గగయుక్తిన్ 65

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను వరుసగా ర, న, భ గగ అను గణములుండును. మొదటి యక్షరమునకును, ఏడవయక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| ర | న | భ | గగ |
|---|---|---|---|
| U I U | I I I | U I I | U U |
| స్వాగతం | బ గు ల | స ద్గు ణ | లక్ష్మి |

## వంశస్థ వృత్తము

సముజ్జ్వలాంగా! జ, త, § జంబు, రేఫతో
సమర్పవంశస్థ న § మాహ్వయంబగున్ 66

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను వరుసగా జ, త, జ, ర అను గణములుండును. మొదటి అక్షరమునకును, ఎనిమిదవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| జ | త | జ | ర |
|---|---|---|---|
| I U I | U U I | I U I | U I U |
| స ము జ్జ్వ | లాంగా జ | త జం బు | రే ఫ తో |

## ఇంద్రవంశ వృత్తము

సన్మానధారీ! తత § జంబు రేఫతో
విన్నింద్రవంశాహ్వయ § వృత్తమొచనున్ 67

నాలుగు పాదములుండును. ప్రతి పాదమునను వరుసగా త, త, జ, ర అను గణములుండును. మొదటి యక్షరమునకును, ఎనిమిదవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| త | త | జ | ర |
|---|---|---|---|
| U U I | U U I | I U I | U I U |
| సన్మాన | ధారీ త | త జం బు | రేఫతో |

## మేఘ విస్ఫూర్జిత వృత్తము

రమానాథు న్నాథున్ యదుకులశిరో
రమ్యరత్నాయమానున్
సముద్యత్తేజిష్ణున్ దనుజయువతీ
స్ఫారధైర్యాపహారున్
విముంచ్రీతిం జేరొక్క చంద్రరుణవిరతిన్
మేఘవిస్ఫూర్జితాఖ్యన్
గ్రమ్మం బొప్పన్ జెద్దల్ యమనసముల్
రాగముల్ గా ముకుందా! 68

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను వరుసగా య, మ, న, స, ర, గ - అను గణములుండును. మొదటి యక్షరమునకును, పదు మూఁడవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు. అరుణ విరతి - సూర్యయతి. సూర్యులు పండ్రెండుగురు. కాన పండ్రెండవయక్ష రముపై - అనఁగా పదుమూఁడవ అక్షరము యతిమైత్రి.

| య | మ | న | స | ర |
|---|---|---|---|---|
| I U U | U U U | I I I | I I U | U I U |
| రమానా | థున్ నాథున్ | యదుకు | లశిరో | రమ్య ర |

| ర | గ |
|---|---|
| U I U | U |
| త్నాయమా | నున్ |

## భద్రకవృత్తము

విద్రుమాభ! రసంబువన్
భద్రకంబు ధరిత్రిపై. 69

నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను వరుసగా ర, న, ర అనుగణము లుండును. ఇందు యతినియతి లేదు. పాదమునకు 10 అక్షరములకంటెఁ దక్కువ అక్షరములున్నచో యతినియతి యుండదు. దీనిలో ఎనిమిది యక్షరములే యున్నవి కనుక యతినియతి లేదు. ఈ భద్రక వృత్తము కవిజనాశ్రయ, అప్పకవీయములలోఁ జెప్పబడలేదు. అందలి భద్రకవృత్తమునఁ బ్రతిపాదమునకు ర, న, ర అనుగణము లుండును.

| ర | న | ర |
|---|---|---|
| U I U | I I I | U I U |
| విద్రుమా | భ రస | రంబులన్ |

ఇందు ఒక యక్షరము లోపించుటచే నెవరో ర, స, వ అను గణములు గల పయి భద్రక వృత్తమును గల్పించియుందురు.

ర, స, వ అను గణములు గల వృత్తము సరోజ వృత్తమని సంస్కృత ఛందమునఁ గలదు.

ఉదా:-

| ర | స | వ |
|---|---|---|
| U I U | I I U | I U |
| విద్రుమా | భ ర సం | బు వన్ |

ప్రాసనియమము గలదు.

## మణిరంగవృత్తము

శ్రీరసద్వయ సేవ్యగ రాగా
ధారమైనది దా మణిరంగక్. 70

నాలుగుపాదము లుండును. ప్రతిపాదమునను వరుసగా ర, స, స, గ అను గణము లుండును. మొదటి యక్షరమునకును, ఆఱవ యక్షరమున కును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| ర | స | స | గ |
|---|---|---|---|
| U I U | I I U | I I U | U |
| శ్రీ రస | ద్వయ సే | వ్యగ కా | లా |

## వనమయూర వృత్తము

ఉన్నతములై వనమ యూరకృతులొప్పన్
ఎన్నంగ భజంబుల వ యిన్ న, స, గగంబుల్
చెన్నొందవ దంతియతి చెందియలరారన్
వెన్నునినుతింతురు వివేకు లతిభక్తిన్. 71

(అనంతుని ఛందము)

నాలుగు పాదము లుండును. ప్రతిపాదము నను వరుసగా మ మ, గ గ అను గణము లుండును. ఇందు ఎనిమిది యక్షరములే యున్నవి కాని యతినియతి అక్కఱలేదు. కాని ఛందఃకర్తలు యతినియతి నాటించి యున్నారు.

| మ | మ | గ గ |
|---|---|---|
| U U U | U U U | U U |
| ఉద్యన్మా | గా యుక్తం | బై నన్ |

మా మ, మ. గా గ గ

ఇది సర్వ గురు వృత్తము.

## విద్యున్మాలా వృత్తము

విద్యున్మాగా ౯ యుక్తంబై నన్
విద్యున్మాలా ౯ వృత్తంబయ్యెన్. 72

(ఛీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునకు మ,మ,గ,గ, అను గణము లుండును. ఇది ఎనిమిదవ ఛందస్సులోని దగుటచే యతి నియతిని బాటింపనక్కఱలేదు. కాని ఛందఃకర్తలు పాటించియున్నారు. మొదటి యక్షరమునకును, అయిదవ యక్షరమునకు యతిమైత్రి. ప్రాస నియమము గలదు. ఇది సర్వ గురువృత్తము.

మా=మ, దు. గా=గ, గ.

| మ | మ | గగ |
|---|---|---|
| U U U | U U U | U U |
| విద్యున్మా | గా యుక్తం | బై నన్ |

## ద్రుత విలంబితవృత్తము

ద్రుత విలంబిత ౯ దిక్కరవృత్తము
ప్రతిమయ్యెన ౯ భారగణంబులన్. 73

(ఛీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతి పాదమునకును న,భ,భ,ర అను గణములుండును. మొదటియక్షరమునకును, ఏడవ యక్షరమునకును యతి మైత్రి. ప్రాసనియమములు కలవు.

| న | భ | భ | ర |
|---|---|---|---|
| I I I | U I I | U I I | U I U |
| ప్రతిమ | మయ్యెన | భారగ | ణంబుల |

## చంద్రకళా వృత్తము

శ్రావకాభరణాంక! దిశావి
    శ్రామముతోడ ర, సా, తముల్
జావిలగ్న, గకారయుతంబై
    చంద్రకళాహ్వయమైచనున్. 74

(భీమన ఛందము)

నాలుగు పాదము లుండును. ప్రతిపాదమునను ర,స,స,త,జ,జ,గ అను గణములుండును. మొదటి యక్షరమునకును, పదునొకండవ యక్షరమునకును యతి మైత్రి. ప్రాసనియమముగలదు.

దిశా విశ్రామము=దిశలు పది. పదింటిపై నన(గా పదునొకండవ యక్షరము యతిమైత్రి. సా = స,స. జా = జ, జ.

| ర | స | స | త |
|---|---|---|---|
| U I U | I I U | I I U | U U I |
| శ్రావకా | భరణాం | క దిశా | విశ్రామ |

| జ | జ | గ |
|---|---|---|
| I U I | I U I | U |
| ముతోడ | ర సా త | ముల్ |

## అంబురుహ వృత్తము

శ్రీరమణీప్రియ! పుల్లియ రేచ! వి
    శిష్టకల్ప మహీజ! భా,

భా, ర, న, వంబుల భానువిరామము
వల్క నంబురుహాంబగున్.

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను భ,భ,భ,భ,ర,స,వ అను గణములుండును. మొదటియక్షరమునకును పదమూడవ యక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| భ | భ | భ | భ |
|---|---|---|---|
| U I I | U I I | U I I | U I I |
| శ్రీరమ | ణీప్రియ | మల్లియ | రేభ వి |

| ర | స | వ |
|---|---|---|
| U I U | I I U | I U |
| శిష్టక | ల్పమహీ | జ భా |

## క్రౌంచపదవృత్తము

పంచశరాభా! యంచిత పుణ్యా!
భ,మ,స,భ,న,న,న,య పరివృత్తమైనన్
క్రౌంచపదాఖ్యం-బంచితమయ్యెన్
క్రమయతి దశవసు కలితముగాఁగన్. 76

(భీమన చందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను భ, మ, స, భ, న, వ, న, య అను గణములుండును. మొదటి యక్షరమునకును, బదునొకొండవ అక్షరమునకును, మరల పందొమ్మిదవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| | | | |
|---|---|---|---|
| భ | మ | స | భ |
| U I I | U U U | I I U | U I I |
| ప్రంచ శ | రాభా యం | చితపు | ణ్యా భ్రమ |

| | | | |
|---|---|---|---|
| న | న | న | య |
| I I I | I I I | I I I | I U U |
| సభ న | న నయ | ప్రరివృ | తమైనన్ |

## సాధ్వీవృత్తము

నారదసనకస ‡ నందనవినుత న
‡ నాథ? భ,న,జ,న,స. ‡ నా, భగురుల్
చారుశిఖరియతి ‡ శైలవిరమణము
‡ క్ష్మాధర విరతియు ‡ సాధ్వియగుᳲ. 77

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను భ,న,జ,న,న,న,న,గ అనుగణము లుండవలయును. మొదటి అక్షరమునకును ఎనిమిదవ యక్ష రమునకును, పదునైదవ అక్షరమునకును, ఇరువదిరెండవ అక్షరమున కును యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| | | | | |
|---|---|---|---|---|
| భ | న | జ | న | స |
| U I I | I I I | I U I | I I I | I I U |
| నారద | సనక | స నంద | న విను | త సనా |

| | | | |
|---|---|---|---|
| న | న | భ | గ |
| I I I | I I I | U I I | U |
| థ భన | జన స | నా భగు | రుల్ |

శిఖరి = శైల = క్ష్మాధర = పర్వతము. పర్వతము సప్త సంఖ్యను దెలుపును. ఏడక్షరములపై నసఁగా ఎనిమిద పదునైదవ ఇరవది రెండవ యక్షరములు పరస్పరము యతిమైత్రి నందును.

## మలయజవృత్తము

నళినవిలోచన ÷ కజనసశంబులు
÷ నభనగణంబులు ÷ నటలగముల్
మలసి గిరిత్రయ ÷ మహితయతుల్ దగి
÷ మలయజవృత్తము ÷ మహి వెలయున్. 78

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను న,జ,న,స,న,న,భ,న లగ - అనుగణము లుండును. మొదటి యక్షరమునకును ఎనిమిదవ, పదునైదవ, ఇరువది రెండవ అక్షరములకు యతిమైత్రి చెల్లును. ప్రాసనియమము గలదు.

| న | జ | న | స | న |
|---|---|---|---|---|
| I I I | I U I | I I I | I I U | I I I |
| నళిన | విలోచ | న నజ | నస నం | బులు న |

| న | భ | న | లగ |
|---|---|---|---|
| I I I | U I I | I I I | I U |
| భన గ | ణంబులు | నట ల | గముల్ |

ఇది ఇరువది యారవ ఛందములోని వృత్తము.

## ప్రభువృత్తము

ప్రమోదిత గజముఖు ÷ రసవిక్రమముల్
÷ రమణం గని వ ÷ ర్యనుతంబునునై
క్రమమున న,న,నలు ÷ రహిన్ దుజశా
÷ రములును లగమున్ ÷ ప్రభువృత్తమగున్ 79

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను న,న,న,జ,జ,జ,జ,జ లగ - అను గణములుండును. మొదటి యక్షరమునకును, తొమ్మిదవ అక్షరమునకును, పదునేడవ అక్షరమునకును, ఇరువదియొకటవ అక్షర మునకును, యతిమైత్రి. ప్రాసనియమము గలదు.

| న | న | న | జ | జ |
|---|---|---|---|---|
| I I I | I I I | I I I | I U I | I U I |
| ప్రముది | తగజ | ఋతు ర | న విశ్ర | మముల్ ర |

| జ | జ | జ | వ |
|---|---|---|---|
| I U I | I U I | I U I | I U |
| మణం గవి | వ ర్య | మతంబు | నునై |

ఇదియు ఇరువది యాఱవ ఛందములోనిదే.

## మంగళమహాశ్రీ వృత్తము

శ్రీమహితలోకహిత \$ శిష్టజన సేవిత వి
\$ శేషగుణ మంగళ మహాశ్రీ
నామమగు నబ్జజన \$ నంబులకడన్ భజన
\$ నంబులు గగంబులు చెలంగన్ 80

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను భ, జ, స, న, భ, జ, స, న, గగ అను గణము లుండును. మొదటి యక్షరమునకును తొమ్మిదవ అక్షరమునకును, పదునేడవ అక్షరమునకును యతిమైత్రి. ప్రాసనియమము గలదు. ఇదియు ఇరువది యాఱవ ఛందములోనిదే.

| భ | జ | స | న |
|---|---|---|---|
| U I I | I U I | I I U | I I I |
| శ్రీమహి | తశోక | హిత శి | ష్ట జన |

| భ | జ | స | న | గగ |
|---|---|---|---|---|
| U I I | I U I | I I U | I I I | U U |
| సేవిత | వి శేష | గుణ మం | గళమ | హా శ్రీ |

ఇరువది యాఱు అక్షరములకు మించిన అక్షరములుగల వృత్తము లీ దిగువఁ గొన్ని చూపఁబడుచున్నవి. ఇట్టి వృత్తములకు ఉద్దురమాలా వృత్తములనియు, ఉపరివృత్తములనియు పేర్లుకలవు.

## లయగ్రాహి

ఇంబలరఁగ భజస నంబుల తుదన్ భజస
 నంబులు భకారము నొకండంబడ లయగ్రా
హింబరఁగఁ జెప్పఁగల శంబిడిన యట్లు యగ
 ణంబు కృతివిూఁద నమరుం బతహితార్థీ! 81

(భీమన ఛందము)

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను భ, జ, స, న, భ, జ, స, న, భ, య అను గణములుండును. ప్రతిపాదమునను తొమ్మిదేసి యక్షరములకుఁ బ్రాసయతులు మూఁడుచోట్ల నుండవలయును. పద్య పాద ద్వితీయాక్షరము ప్రాస మనఁబడును. యత్యక్షరము ప్రక్క ప్రాసాక్షరమును గూర్చుట ప్రాసయతి యనఁబడును. ప్రాసనియమముగలదు.

| భ | జ | స | న | భ |
|---|---|---|---|---|
| U I I | I U I | I I U | I I I | U I I |
| ఇంబడ | రఁగా భ | జ సనం | బుల తు | దన్ భజ |

| జ | స | న | భ | య |
|---|---|---|---|---|
| I U I | I I U | I I I | U I I | I U U |
| ప నంబు | లు భకా | రము నొ | దం బడ | లయు గ్రా |

## లయవిభాతి

ననననన నంబులును ॥ నననన సగంబులును
బొనఁగి కృతి పాదములు ॥ రసికముగఁ జెప్పన్
గుసుమశరసాయకవ ॥ దనదృశ గుణాభినుత!
రసలయవిభాతియని ॥ రసముసుకవీంద్రుల్ 82

(భీమన ఛందము)

నాలుగు పాదము లుండును. ప్రతి పాదమునను న, స, న, న, స, న, న, స, న, న, స, గ అను గణములుండును. ప్రతి పాదమునను పదేసి యక్షరములకుఁ బ్రాసయతులు మూఁడుచోట్లఁ గూర్పవలయును. ప్రాసనియమము గలదు.

| న | స | న | న |
|---|---|---|---|
| I I I | I I U | I I I | I I I |
| కుసుమ | శర సా | యక వ | దన దృ |
| స | న | న | స |
| I I U | I I I | I I I | I I U |
| శ గుణ | భి నుత | ర సల | య విభా |
| న | న | స | గ |
| I I I | I I I | I I U | U |
| తియని | ర సమ | సుకవీం | ద్రుల్ |

## లయగ్రాహి లయ విఘాతులకు యతి నిర్ణయము

తే. తొమ్మిదింటను దొమ్మిది తొమ్మిదింట
ధృతి లయగ్రాహికిని బ్రాస యతులు సెల్లుఁ,
బదిటఁ బదిటను బదిటను బ్రాసయతులు
తగ లయవిఘాతికిని జెల్లు భానవారి! 83

లయగ్రాహికిఁ బ్రతి పాదమునను దొమ్మిదవయక్షరము మీఁదను, మరల దానికిఁ దొమ్మిదవ యక్షరము మీఁదను, మరల దానికిఁ దొమ్మిదవ యక్షరము మీఁదను బ్రాసయతులు చెల్లును.

లయవిఘాతికిఁ బ్రతిపాదమునను బదియవ యక్షరము మీఁదను, మరల దానికిఁ బదియవ యక్షరము మీదను, మరల దానికిఁ బదియవ యక్షరము మీఁదను బ్రాసయతు లుంచవలెను.

## లాక్షణీ వృత్తము

వృ. విరమణము భననన ములును
భాసుర భననన లెనసినచో
లాక్షణీ యనఁదగు నతులిత మదనవి
లాసలలిత గుణగణజలధీ! 84

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను భ,న,న,న,న,భ,న,న,స అను గణములుండును. మొదటి యక్షరమునకును, బదునాఱవ యక్షరమునకును యతిమైత్రి.

| భ | న | న | న | న |
|---|---|---|---|---|
| U I I | I I I | I I I | I I I | I I I |
| లాక్షణీ | యనఁద | గు నతు | లిత మ | దన వి |

| | | | |
|---|---|---|---|
| భ | న | న | స |
| U I I | I I I | I I I | I I U |
| లాసల | లిత గు | ణ గణ | జలధీ |

## రమణక వృత్తము

మనసిజ జనక న ఽమదరిపు గజహారి
ఽ మదగజవసు విర ఽమణములతో
నననన నననన ఽ నలగము లెనయఁగ
ఽ నరవరనుత! రమ ఽ ణక మమరున్ 85

నాలుగు పాదములుండును. ప్రతిపాదమునను తొమ్మిది నగణము లును, పిదప నొక్క లగము నుండును. 9, 17, 25 అక్షరములు యతిమిత్ర స్థానములు. మద—అష్టమదములు గజ=అష్ట దిగ్గజములు, వసు-అష్టవసువులు,-ఎనిమిదేసి యక్షరములపై, ననఁగా తొమ్మిదవ యక్షరములు యతిమిత్ర స్థానములని తెలియవలయును. ప్రాసనియమము గలదు.

| | | | | |
|---|---|---|---|---|
| న | న | న | న | న |
| I I I | I I I | I I I | I I I | I I I |
| మనసి | జ జన | క సమ | దరిపు | గజ హ |
| న | న | న | న | వ |
| I I I | I I I | I I I | I I I | I U |
| రిమద | గజ వ | సు విర | మణము | లతో. |

## దండకము

అమరంగ నసహంబు లందాదిగానొండెఁ, గాదేని
నాదిన్ తకారంబుగానొండె, లోనంద కారమ్ము లిమ్మైగకా
రావసానంబుగాఁ జెప్పినన్ దండకంబండ్రు దీనిం గవుల్. 86

దండకమునందు స,న,హ గణము లాదిలోనుండి వానిపై వలసి నన్ని తగణములును, తుదను గురువు నుండవలయును. లేదా మొదటి నుండి తుదివఱకును వలసినన్ని తగణములును నిలుపవచ్చును. తుదిని గురువుండవలయును. దీనికి యతిప్రాసనియమములేదు. దండకమునం దొకే పాదముండును.

| స | న | హ |
|---|---|---|
| I I U | I I I | U I |
| అమరం | గ నస | హంబు |

| | | | |
|---|---|---|---|
| U U I | U U I | U U I | U U I |
| అందాది | గా నొండెఁ | గా దేని | నాదిన్ త |
| U U I | U U I | U U I | U U I |
| కారంబు | గానొండె | లోనంద | కారమ్ము |
| U U I | U U I | U U I | U U I |
| లిమ్మై గ | కారావ | సానమ్ము | గాఁజెప్పి |
| U U I | U U I | U U I | U |
| నన్ దండ | కం బండ్రు | దీనింగ | వుల్ |

# యతి ప్రాసములు

## యతుల పర్యాయపదములు

క. విశ్రాంతి విరతి విశ్రమ
విశ్రామ విరామ విరమ విరమణములనన్
విశ్రుతమగు యతి కృతి నధి
కశ్రావ్యంబై పెడంగు గా నిడవలయున్. 87

(భీమన ఛందము)

విశ్రాంతి, విరతి, విశ్రమము, విశ్రామము, విరామము, విరమము, విరమణము అను నేడును యతికిఁ బర్యాయ పదములు.

## యతి నిర్వచనము

క. విలసత్పాదాద్యక్షర
ములు వళ్లగు, నాద్వితీయ ములు ప్రాసంబుల్;
నెలకొని తమ తమ పాదం
బుల యతిపై నన్ని పాద ముల వళ్ళమరున్. 88

(భీమన ఛందము)

పద్యపాదము నందలి మొదటి యక్షరమునకు యతి (వడి) యని పేరు. పాదము నందలి ద్వితీయాక్షరమునకుఁ బ్రాసమని పేరు. ప్రాసమునకు నిర్దిష్టమైన నిర్వచనము పాదము నందలి మొదటి యచ్చునకును, రెండవ యచ్చునకును నడుమ నున్న అక్షరము ప్రాసమనఁబడును.

ఉదా:- శ్రీ వక్షోజ.... ఇందు మొదటి యచ్చు 'ఈ'. రెండవ యచ్చు 'అ'. ఈ రెంటికిని నడుమ నున్న 'వ' కారము ప్రాసమగును. ఇంకొక యుదాహరణము. 'కాంతను జూచి.... ఇందు మొదటి యచ్చు

'ఆ'. రెండవ యచ్చు 'అ'. ఈ రెంటి నడుమ నున్న పూర్ణబిందు పూర్వక త వర్ణము ప్రాసము. యతిప్రాసము లన్నిపాదము లందు నుండును.

## యతిమైత్రి

సీ. క్షాకును కఖగఘల్ చఛజఝల్ శషసలు,
అయహాలకెల్లఁ గి య్యలు ఘటించుఁ,
గీర్తింపఁ ౠరయు గిలకయు రేఫకు,
నావడి సెల్లును ణనలకెల్ల,
మావడిసెల్లును మాకునుం బాలకు,
తావడిసెల్లును తథదధలకు,
పోలింప పఫబభల్ మూలకు విలసిల్లు,
లావడి సెల్లును రళలకెల్లఁ,

తే. దలఁపఁ దలకట్ల కైత్వ మా కౌత్వమును దీర్ఘ,
మిత్వమేత్వంబు వట్రువ లేకసరణిఁ,
గొమ్మునకుఁ జెల్లు నోత్వంబు నిమ్మగాను,
యతుల కివి లక్షణములు వ ద్మాయతాక్ష! 89

హల్లులలో యతిమైత్రి.

| | | |
|---|---|---|
| క్ష—క, ఖ, గ, ఘ, | | ఇవి పరస్పరము మిత్రములు |
| చ, ఛ, జ, ఝ, శ, ష, స. | | " |
| అ, య, హ | | ఇవి పరస్పరము మిత్రములు |
| ర | — 'ఋ', 'ౠ' | " |
| న, ణ | — 'ం' | " |
| ంప, ంఫ, ంబ, ంభ, మ | — | " |
| త, థ, ద, ధ, | — 'ం' | " |
| మ, ప, ఫ, బ, భ | | " |
| ర, ళ, ల | — 'ల' | " |

హల్లులకు యతిమైత్రివి ఘటించునప్పుడు వాని మీఁద నుండు నచ్చులకు గూడ యతిమైత్రి కుదురునట్లు చూడవలయును.

## అచ్చుల పరస్పర యతిమైత్రి

| | | |
|---|---|---|
| అ, ఆ ఐ, ఔ | — | పరస్పర మిత్రములు |
| ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ | — | ,, |
| ఉ, ఊ, ఒ, ఓ | — | ,, |

## యతిభేదములు

సీ. సరసంపు యతియును, స్వసంయుక్తయతి, వర్గ,
గరిమ దేశీయ, మేకాక్షరియుఁ, బోల్కి,
చక్కటియతి, యను స్వరయతి, స్వరయతి,
యావడి, బువ్వడి మావడియును,
ప్రభు, విభాగములు, సౌభాగ్యంబు ప్రాసంబు,
భిన్నంబు, ప్రాది, య భిన్నవిరతి,
వెలయు సభేదంబు వృద్ధి, నిత్యసమాన,
ప్లుతయుతు, లాదేశ యతి, వికల్ప,

తే. కాకువులు, రివ్వడియును, న ఖండవిరతి,
యుభయయతి, యశేషవర్గాదు లొవ్వ మెఱసి
కృతుల ముప్పదియొక్కటి యతులు దనరు
సత్కవుల సమ్మతంబున జలధిశయన! 90

(లక్షణ చూడామణి)

ఈ సీస పద్యమున 31 యతి భేదములు చెప్పఁబడినవి. ఇవిగాక మఱి 8 యతి భేదములు గలవు. మొత్తము యతుల సంఖ్య 39.

## యతి భేదములు

1. సరసయతి
2. సంయుక్త యతి
3. వర్గయతి
4. దేశీయ యతి
5. ఎక్కటి యతి
6. పోలిక యతి
7. చక్కటి యతి
8. అనుస్వార యతి
9. స్వర యతి
10. యావడి
11. ఋవడి
12. మావడి
13. ప్రభుయతి
14. విభాగయతి
15. సౌభాగ్యయతి
16. ప్రాసయతి
17. భిన్నయతి
18. ప్రాదియతి
19. అభిన్నయతి
20. అభేదయతి
21. వృద్ధియతి
22. నిత్యసమాసయతి
23. ప్లుతయతి
24. ఆదేశయతి
25. వికల్పయతి
26. కాకువడి
27. రివడి
28. అఖండయతి
29. ఉభయయతి
30. యవర్గయతి
31. శవర్గయతి

## అదనముగా నున్న 8 యతులు

32. జ్ఞావడి
33. సరసస్వరయతి
34. లుప్త విసర్గక స్వర యతి
35. నిత్య యతి
36. అనునాసిక వికల్పయతి
37. ఇ కార యతి
38. పరరూపయతి
39. ఱావడి.

పై 39 యతులకు లక్షణోదాహరణములు వరుసగాఁ బ్రదర్శింపఁబడుచున్నవి.

## 1. సరస యతి

ఆ. ఙనలు చెల్లుఁ గమల ॥ నాభ! యొండొంటికి
అయహ లొనరఁజెల్లు ॥ హస్తివరద!
శషసలొందునండ్రు ॥ చ ఛజఝంబులలోడ
సరసయతులు నాఁగ ॥ జలధిశయన! 91

| | |
|---|---|
| 1. ఙ, న. | ఇవి పరస్పర మిత్రములు |
| 2. అ, య, హ | |
| 3. శ, ష, స, చ, ఛ, జ, ఝ | |

ఈ యతికి లక్ష్యములు లక్షణ పద్యములలోనే యున్నవి.

| | |
|---|---|
| మొదటి పాదమున | ఙ, న లకు యతిమైత్రి |
| రెండవ పాదమున | అ, హ, లకు యతిమైత్రి |
| మూడవ పాదమున | శ, చ లకు యతిమైత్రి |
| నాల్గవ పాదమున | స, జ లకు యతిమైత్రి |

## 2. సంయుక్త యతి

క. వెలయఁగ సంయుక్తాక్షర
ములలో నెద్దానినైన ॥ మునుకొని వడిగా
నిలుపఁదగుఁ బాదంబుల
నలఘు గుణాన్వితుఁడ! రేచ ॥ యనదృశదానా! 92
(భీమన ఛందము)

యతి స్థానమునఁగాని యతి మిత్ర స్థానమునఁగాని సంయుక్తాక్షర మున్నచో నందేదే నొక యక్షరమునకు మైత్రి చెల్లినఁ జాలును.

ఉదా : క్షాత్ర నాయక నీవు నన్నుఁ గైకొని........

ఇందు యతి స్థానమున కకార, షకార మకారముల సంయుక్తము గలదు, వీనిలో కకారమునకు మాత్రమే 'గై' యని యతిమైత్రి పాటింప బడినది, ఇట్లే షకార, మకారములలో దేనికైనను యతిమైత్రి పాటింప వచ్చును.

క. ఒక్కెడఁగున విశ్రాంతులు
పెక్కగుచో సంయుతములు పెనువన్ మును జ
ద్దక్కరమునఁ దా నెత్తిన
యక్కరమే మునువలయు నన్నిటఁ గృష్ణా! 93

ఒక్క పాదముననే రెండు మూఁడు యతులు గల వృత్తములందు పాదాద్యక్షరము సంయుక్తమయినచో, వానిలో నేయక్షరమునకు మొదట మైత్రి గూర్పఁబడినదో, తక్కిన స్థానములలోఁ గూడా నాయక్షరమునకే యతిమైత్రి పాటింపవలయును. కాని మొదట నొక యక్షరమునను ఇంకొకచో మఱియొక అక్షరమునకు,వేఱొకచో నింకొకదానికి యతిమైత్రి పాటింపరాదు. ఇట్లే ఒక మిత్రస్థానమున సంయుక్తాక్షర మున్నచో, పాదాదిని వానిలో దేనికి మైత్రి పాటింపఁ బడినదో, తక్కిన చోట్లఁగూడ దానికే మైత్రి పాటింపవలయును.

స్రగ్ధర, మహాస్రగ్ధర, మానిని, కవిరాజ విరాజితము, క్రౌంచ పదము, మంగళ మహాశ్రీ మున్నగునవి బహుయతులు గల వృత్తములు.

బహుయతులు గల వృత్తములలో సంయుక్త యతి కుదాహరణము.

1. మహాస్రగ్ధర :

శ్రిత బాహాంగానఁగా వచ్చితి సకల జగత్సేవ్యమానున్ మహేంద్ర - ప్ర.

ఇందు యతి స్థానమున శవర్ణ రేఫముల సంయుక్తాక్షరము గలదు వీనిలో శవర్ణమునకు 'చ్చి' థ యని. మొదట యతిమైత్రి పాటింపఁబడి నది. అదే పాదమునఁ గల మూఁడవ మిత్రస్థానమునను "త్సే" యను దానిలోని సకారమును శవర్ణమునకే మిత్రముగా గ్రహింపబడినది.

2. స్రగ్ధర :

గాండీవజ్యారవం బుత్కటమయి పెలుచన్ గ్రమ్మినన్ భీము బాహా

స్రగ్ధరలో 8, 15 అక్షరములు మిత్రస్థానములు. గా - త్క - గ్ర అని మూఁడుచోట్లను నొక్క క కారమునకే యతిమైత్రి పాటింపబడి నది.

### 3. వర్గయతి

క. నిక్కవ మయ్యెన్ వర్గుల
యక్కరమగు వళ్ళు నుపనగు ఙఞణనమల్
దక్కఁ బెఱ నాలుగింటికి
దిక్కరిసన్నిభుఁడ! రేచ! ధీజనవినుతా! 94

వర్గాక్షరములు.

| | |
|---|---|
| క వర్గము | క, ఖ, గ, ఘ, ఙ |
| చ వర్గము | చ, ఛ, జ, ఝ, ఞ |
| ట వర్గము | ట, ఠ, డ, ఢ, ణ |
| త వర్గము | త, థ, ద, ధ, న |
| ప వర్గము | ప, ఫ, బ, భ, మ |

ప్రతి వర్గమునందును జివరి యక్షరము తప్ప, తక్కిన నాల్గింటికిని బరస్పరము యతిమైత్రి, చెల్లుట వర్గయతి యనఁబడును.

ఉదా :- దిక్కరి సన్నిభుఁడ రేచ ధీజన వినుదా. ఇందు ది - ధీ వర యతి.

## 4. దేశీయయతి

తే-గీ. అచ్చుతోఁగూడి దేశీయ యనెడి విరతి
యెన్న నొక్కొక్కచోటఁ గ్రిక్కిఱియుఁ గృతుల
సరసలక్షణకవులు గ్రచ్చఱ నొనర్ప,
భంజితాసురసముదాయ యాంజనేయ! 95

(చిత్రకవి పెద్దన,లక్షణసార సంగ్రహము)

క్రిక్కిఱియు, క్రచ్చఱ, రూపఱు మున్నగుదేశ్య శబ్దములలో స్వర సంధి గలదు. క్రిక్కు+ఇఱియు = క్రిక్కిఱియు, క్రచ్చు+అఱ =క్రచ్చఱ, రూపు+అఱు = రూపఱు. రెండు పదముల కలయిక యైనను నివి యేకపదమువలెనే భాసించును. ఇట్టివానిలో సంధి విడఁదీసినప్పుడు పరపదాద్యచ్చునకును, సంధి కలిసి యున్నప్పుడు విశిష్టవర్ణమునకును యతిమైత్రి పాటింపవచ్చును. ఇట్లు రెండు విధముల యతిమైత్రి పాటింపఁదగునుగాన దీనికి ఉభయ యతియనిపేరు. దీనినే యప్పకవి యుభయవళులలో నొకటిగా దేశ్య నిత్యసమాస విశ్రాంతిగాఁ బేర్కొనినాఁడు.

పలు పద్యమున రెండవ పాదమున
ఎన్న నొక్కొక్కచోటఁ గ్రిక్కిఱియుఁ గృతుల
ఇందు ఎ—ఇ అని అచ్చునకు యతిమైత్రి పాటింపఁబడినది.
మూడవ పాదమున
సరస లక్షణ కవులు గ్రచ్చఱ నొనర్ప
ఇందు స — చ్చ అని హల్లులకు యతిమైత్రి పాటింపఁబడినది.

## 5. ఎక్కటియతి

క. ధరనెక్కటివళ్ళనఁదగు
లరమఅవలు వానితోఁ దొరకొలంగళ లాకున్
సరిళాయని విశ్రమవే
ళ రమాధిప! రెండునుం గలసి వర్తించున్. 96

(అనంతుని ఛందము)

ల, ర, మ, అ, వ అనునవి దేనికదే యతిమైత్రి నందుటకు ఎక్కటియతియనిపేరు ల, ళ ల కభేద మగుటచే వానికి మాత్రము పరస్పరము యతిమైత్రి చెల్లును.

ఆ. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహమూర్తి రక్షకుండు
ఆఁగవేలుపనఁగ ఆంపిల్లు నెక్కటి
వళ్ళనాఁగనిట్లు వనజనాభ! 97

(అనంతుని ఛందము)

ఉదాహరణము.

ఇందు మొదటి పాదమున 'మ-మ'లకు, రెండవ పాదమున 'రా-ర' లకు, మూఁడవ పాదమున 'ఆ-అ'లకు, నాలుగవ పాదమున 'వ-వ' లకు యతిమైత్రి చెల్లినది.

ఏ యక్షరమున కాయక్షరమే మైత్రిచెల్లు యతి కావున దీనికి ఎక్కటి యతి యనుపేరు వచ్చినది.

ర వర్ణమునకు ర వర్ణమును, అ కారమునకు అ కారమును యతి మైత్రి చెల్లుటకు అప్పకవీయమున ఏకతరయతి యనిపేరు పెట్టఁబడినది.

ఈ పద్యమున రెండవపాదమున ము-పూ లకు యతిమైత్రి చెల్లినది. ఇందలి 'ము' కేవల మువర్ణము. విభక్తికాదు. కావున నిది చక్కటి యతి యగుచున్నది.

## 8 అనుస్వారయతి (బిందుయతి)

క. పంచక వర్గాక్షరములు
పంచమవర్ణములఁ గూడి  పరఁగ నటించుం
వంచింపక పైనాలుగు
నంచితముగఁ బిఱుఁద సున్న  లంటిన చోటన్ 102

(భీమన చందము)

ప్రతి వర్గములోను మొదటి నాలుగక్షరములకును ముందు పూర్ణ బిందువున్నచో, వానికి తత్తద్వర్గ పంచమాక్షరముతో (అనునాసికముతో) యతిమైత్రి చెల్లుటకు అనుస్వారయతి యనిపేరు.

దీనిని అప్పకవి బిందుయతి యనినాఁడు.

ంక, ంఖ, ంగ, ంఘ — ఙ
ంచ, ంఛ, ంజ, ంఝ — ఞ
ంట, ంఠ, ండ, ంఢ — ణ
ంత, ంథ, ంద, ంధ — న
ంప, ంఫ, ంబ, ంభ — మ

ఙాకు వడిసెల్లు రత్నాకం  కణమనంగ
ఞాకు వడిసెల్లు బర్హిపిం  ఛంబనంగ
ణాకు వడిసెల్లుఁ గనకమం  డపమనంగ
నాకు వడిసెల్లుఁ దివ్యగం  ధంబనంగ
మాకు వడిసెల్లుఁ విజితశం  బరుఁడనంగ 103

(భీమన ఛందము)

జాకు వడిసెల్లు రత్న కంకణ మనంగ
ఝాకు వడిసెల్లు బర్హి పింఛం బనంగ
ఞాకు వడిసెల్లుఁ గనక మండపమనంగ
నాకు వడిసెల్లు దివ్య గంధంబనంగ
మాకు వడిసెల్లు విజితశం బరుఁడనంగ

ఇందు ప్రతివర్గమునందును పూర్ణబిందు పూర్వకములయిన మొదటి నాలుగు వర్గాక్షరములకును ఆ వర్గమునందలి పంచమాక్షరమునకు (అనునాసికమునకు) యతిమైత్రి చెల్లుట చూడనగును.

## 9 స్వరయతి

క. అ ఆ ఐ ఔ లకు మఱి
ఇ ఈ లు ఋకారసహిత ఎ ఏ లకునౌ
ఉ ఊ ల్దమలో నొడబడి
ఒ ఓ లకు వళ్ళగు న్నయోన్నతచరితా! 104

(భీమన చందము)

ఈ పద్యమున అచ్చులలో యతిమైత్రి చెప్పఁబడినది.

అ, ఆ, ఐ, ఔ, పరస్పరము యతిమైత్రినందును.
ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ, ,,
ఉ, ఊ, ఒ, ఓ. ,,

## 10. యూవతి

తే. తాయెతును నుయ్యోలయుఁ బయ్యె దయును దక్కఁ
గలుగ దెత్వంబు మధ్య యకారమునకుఁ,
దుదలఁ గ్రియలందు నెత్వంబు గదియు, వాని
కత్వమిడరాదు తెనుఁగున నబ్జనాభ! 105

(కవిజన సంజీవని)

తెనుఁగున తాయెతు, ఊయెల, పయ్యెద అను నామములలోఁదప్ప దక్కిన యే నామము నందును యకారము ఎత్వముతోఁ గూడియుండదు.

దీనినే బాలవ్యాకరణమునఁ జిన్నయసూరి "ఊయేల, పయ్యెద, తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుందాలవ్య వ్రక్రయోగంబులేదు" అని సూత్రీకరించినాడు. నామంబులం దనుటచేఁ 'బోయెను' అను రీతిగాఁ గాల వ్యా॰ ప్రకీర్ణ పదములందును 'యె' ఉండవచ్చునని తెలియవలయును.

సీ. ఒక కాంతయొరఁగిన § సికమీఁది ముడిపువ్వు
ఎత్తులు మెఱయఁదా § యెతులుచుట్టి 106
(చంద్రభాను చరిత్రము)

**తాయెతు అను పద్యమునకు లక్ష్యము**

సీ. ఒక కాంత యొరఁగిన సికమీఁది ముడిపువ్వు
ఎత్తులు మెఱయఁ దాయెతులు చుట్టి

ఇందు పువ్వు+ఎత్తులు అను సంధిలో ఉత్తర పదాద్యచ్చు అయిన ఎ కారముకును తాయెతులోని యె కారసమునకును యతిమైత్రి.

క. వలనొప్పగ నవుడా యు
య్యేలలోపల బాలునునిచి § యిందునిభాస్యల్
కలకంఠ నాదమాధురిఁ
బలుమఱు జెలరేఁగి జోలఁ § బాడిరి ప్రేమన్ 117
(విక్రమార్క చరిత్ర)

**ఉయ్యెలకు లక్ష్యము**

——————————యు
య్యెల లోపల బాలు నునిచి యిందు నిభాస్యల్

ఇందు ఉయ్యెలలోని 'య్యె' కును ఇందులోని 'ఇది' అను దానికిని యతిమైత్రి చెల్లినది.

సీ. వలఁబడ్డ జక్కవ | ల్వాలె నున్న జిలుఁగుఁబ
య్యెదలోని గుబ్బపా | లిండ్లు నెరయ 108

(యయాతి చరిత్ర)

పయ్యెదకు లక్ష్యము.

ఇందు పయ్యెదలోని 'య్యె'కును, పాలిండ్లు (పాలు+ఇండ్లు) అను వానిలోని ఇ కారమునకును యతిమైత్రి.

## 11. ఋ వడి

తే. క్షితి ఋకారస్వరూపమై | యతులు పరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు | కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాస | మృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుఁడు దేవ | వృషభుఁ డనఁగ 109

కేవల ఋ కారమునకు వట్రుసుడితోఁ గూడిన హల్లులన్నింటితో యతిమైత్రి చెల్లును.

ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ

కాని అప్పకవీయమున ఋవడి వేఱు. అందు ఋ వర్ణమునకు రి, రీ, రె, రే, యను వానితో యతిమైత్రి చెల్లుట ఋవడి యని పేర్కొన బడినది.

ఉదా:- ఋత్విజుండని విచారించి

2. వట్రసుడితోఁగూడిన హల్లులకుఁ బరస్వరము యతిమైత్రి చెల్లును.

ఉదా:- వృష్ణికులజుండు కరుణా సమృద్ధుఁ డనఁగ

అప్పకవీయమున దీనికి ఋత్వ సామ్యవళి యనిపేరు.

3. ఇ, ఎ అను అచ్చులకును, వానితోఁ గూడిన 'హ,య'లకును వ్రటసుడితోఁ గూడిన హల్లులతో యతిమైత్రి చెల్లును.

ఉదా:- హైమపీతాంబరుఁడు దేవవృషభుఁడనఁగ

అప్పకవీయమునదీనికి ఋత్వ సంబంధవళియని—పేరు.

ఈ గ్రంథమున నీ మూఁడు విధములయిన యతులకును ఋ వడి యనియే వ్యవహరింపబడినది.

ఆ. ఋభులు సంతసిల్ల ' గ్ౄతముఖ్యులరుదంద
దితిజతతికి నెల్ల ' ధృతిగలంగఁ
తృణముమాడ్కి దాన ' వేంద్రుని దునుమాడి
జయమునొందు వేగ జగదధీశ! 110

(దశకుమార చరిత్రము)

ఋభులు సంతసిల్లఁ గృత ముఖ్యు లరుదంద - ఈ గ్రంథమున నిది ఋవడి యనఁబడినది. అప్పకవీయమున దీనికి ఋత్వ సంబంధవళి యని పేరు.

దితిజ తతికి నెల్ల ధృతి గలంగ.

ఇది వర్గయతిలో స్వరమైత్రి. ఋవడి కాదు. ఇందుఁ బ్రాసయతి కూడఁ జెల్లినది.

తృణము మాడ్కి దాన వేంద్రుని దునుమాడి

ఈ గ్రంథమున నిది ఋవడి యనఁబడినది. అప్పకవీయమున నిది ఋత్వసంబంధవళి యనఁబడినది.

## 12. మావడి

తే. యరలవలు శషసహలును నాదిబిందు
యుతములై మకారవిరామ యుక్తిఁదనరు,
మారుతాత్మజుఁ డరిది సం యమి యనంగ
మదన జనకుండు దనుజ సం హారుఁ డనంగ. 111

(అనంతుని ఛందము)

అంతస్థములును (య,ర,ల,వ), ఊష్మములును (శ,ష,స,హ) పూర్ణబిందు పూర్వకములై మకారముతో యతిమైత్రి చెల్లుటకు ఇందు మావడి యని పేరు.

అప్పకవీయమున నిది మవర్ణ విరామ మనఁబడినది.

ఉదా :- మారుతాత్మజుఁ డరిది సంయమి యనంగ

ఇందు 'మా'కును, పూర్ణబిందు పూర్వక యకారముతో యతిమైత్రి చెల్లినది.

ఉదా :- మదనజనకుండు దనుజసంహారుఁ డనఁగ

ఇందు మవర్ణమునకు పూర్ణబిందు పూర్వక 'హా'తో యతిమైత్రి చెల్లినది.

క. కమలాప్తాంశులు బల వి
క్రమవంతులు ఖడ్గధరులు రాజులు మీరల్
మముఁ బ్రోవఁగఁదగ దే సం
యమి వర్యులఁజూచిరా కుమారకు లెల్లన్. 112

(దశకుమార చరిత్రము)

సం-యమి వర్యులఁ జూచిరా కుమ్మారకు లెల్లన్ - దశకుమా
చరితము.

ఇందు పూర్ణబిందు పూర్వక యవర్ణమునకు 'మా'తో యతిమైత్రి
చెల్లినది.

చ. గరళపు ముద్దలో హ మవ
గాఢమహాశని కోట్లు నమ్మెటల్
హరు నయనాగ్ని కొల్మి యుర
గాధిపు కోఅలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయ లయ
కాలుఁడు కమ్మరి వైరి వీర సం
హరణ గుణాభిరాముఁ డగు
మైలమ భీమన ఖడ్గ సృష్టికిన్. 113

(భీమకవి చాటుధార)

సం-హరణ గుణాభిరాముఁడగు మైలమ భీమన ఖడ్గసృష్టికిన్.
ఇందు పూర్ణబిందు పూర్వక హకారమునకు 'మై' అను దానితో యతిమైత్రి
చెల్లి నది. కావున నివి మూడవి యుదాహరణములు.

## 13, ప్రభుయతి

తే. ఒనర నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధమగుఁ బ్రభునామాంత విరమణంబు
మహి నయోధ్యకు రాజు రా మన యనంగ
క్షితని పట్టపుదేవి సీ త మ యనంగ. 114

(అనంతుని ఛందము)

ద్విత్వ రహితములయిన అన్న, అమ్మ యనునవి (అన, అమ) పరములయి నిత్యసంధి యేర్పడినప్పుడు ఉభయ యతి (అచ్చునకును, హల్లునకును యతిమైత్రి చెల్లును. రామ + అన = రామన ఇది నిత్య సంధి. ఇట్టిచో సంధి ఏర్పడినప్పుడుండు హల్లునకును (మ), సంధి విడఁ దీసినప్పుడుండు అచ్చునకును (అ) ఉభయమునకును యతిమైత్రి చెల్లును.

ఉదా : మహి నయోధ్యకు రాజు రామన యనంగ

ఇక్కడ మ వర్ణమునకును, రామ+అన అనునవి సంధి యేర్ప డగా నుండు మ వర్ణమునకును యతిమైత్రి చెల్లినది.

అతవి పట్టపుదేవి సీతమ యనంగ.

ఇందు అ వర్ణమునకును, సీత + అమ అనునవి సంధిలో గతి యనప్పుడుండు అ వర్ణమునకును యతిమైత్రి కుదిరినది.

ఇందు అన్న, అమ్మ అను వానికే ఈ యతి చెప్పఁబడినది. కాని అయ్య యన్నగు శ్రేష్ఠార్థకములకుఁ గూడ ఈ యతి చెల్లును.

ద్విత్వ రహితములకే కాక, ద్విత్వ సహితములకును, (అమ్మ, అన్న, అయ్య) ఈ యతి చెల్లునని యితర లక్షణ గ్రంథముల వలనను, ప్రయోగముల వలనను దెలియుచున్నది.

ఉ. ఘనుఁడఁగా వేములవాడ వంశజుఁడ దా
క్షారామ భీమేశ నం
దనుఁడఁగా దివ్య విషామృత ప్రకట నా
నా కార్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగఁ జెప్పితిఁ దెలుం
గాధీశ! కస్తూరికా

ఘనసారాది సుగంధ వస్తువుల వే
గందెచ్చి లాలింప రా. 115

(భీమ కవి చాటువు)

భీ - మన నా పేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా

ఇందు భీమన (భీమ+అన) అని నిత్యసంధిని వేఱు చేయఁగా మ వర్ణముపైఁ గనుపట్టు అకారమునకును, తెలుంగాధీశ - అనుదానిలో తెలుంగ+ అధీశ అను సవర్ణదీర్ఘసంధిలో పదములను వేఱు చేసినప్పుడు ఉత్తర పదాద్యచ్చునకును (అ) యతిమైత్రి చెల్లినది.

ఈ యతికి అప్పకవీయమున సామాఖండవిశ్రమమని పేరు పెట్టఁబడినది. సంధి విడదీసినప్పుడు ఉత్తర పదాద్యచ్చునకును, విడఁదీయక కలిసి యున్నప్పుడు కనుపట్టు విశిష్ట వర్ణమునకును (హల్లునకు) ఇట్లు ఉభయమునకును జెల్లు యతిగావున అప్పకవి దీనిని ఉభయ వళులలోఁ జేర్చెను.

## 14. విభాగయతి

తే. సంఖ్యకుం బరిమాణ నం కె క్కుఁ దనరు
శబ్దములపై విభాగోక్తి కె సరణి నంఘ
టించినప్పుడు యతులు రెం కె డేసి యగును
పేంద్రు(ఁ)డిచ్చుధనము మోపెఁ కె డేసి యనఁగ 116

(అనంతుని ఛందము)

రెండు, మూఁడు మొన్నగు సంఖ్యావాచక శబ్దములకును, గంపెఁడు మొన్నగు పరిమాణ వాచక శబ్దములకును విభాగార్థమున 'ఏసి' అనునది చేరును. ఏసి పరమగునపుడు నిత్యసంధి యేర్పడును. రెండు + ఏసి= రెండేసి. గంపెఁడు + ఏసి= గంపెఁడేసి అనుచో సంధి జరిగినప్పుడుండు

హల్లునకును (డే), సంధి విడఁదీసినప్పుడు ఉత్తర పదాద్యచ్చునకును (ఏ)— ఇట్లు ఉభయమునకును యతిమైత్రి చెల్లింప వచ్చును.

ఉదా : సంఘటించినప్పుడు యతులు రెండేసి యగు-ను.

ఇందు టిం అను హల్లునకును రెండేసి యనుదానిలోని డే అను హల్లునకు యతిమైత్రి చెల్లినది.

ఉ-పేంద్రుఁడిచ్చు ధనము మోపెఁడేసి యనఁగ

ఇందు ఉప+ఇంద్రుడు అనుదానిని విడదీసినప్పుడుందు ఉత్తర పదాద్యచ్చునకును, (ఇ) మోపెఁడు+ఏసి అనుదానిలోని 'ఏ' అను నచ్చునకును యతిమైత్రి చెల్లింపఁబడినది.

క. ఆ సేనలఁ గని కినిసి మ
హోసాయక వృష్టి ముంచి యధిపులపై నే
డేసి పదేసి మఱియు నూ
ఱేసి శరములు నిగిడించె రిపుల దరంగన్. 117

నూ- ఱేసి శరములు నిగిడించె రిపు లదరంగన్.

ఇందు నూఱేసి అనుదానిలో సంధి కలిసినప్పుడుందు శిష్ట వర్ణమునకును (ఱే), రిపులు అనుదానిలోని రి అను హల్లునకు యతిమైత్రి చెల్లింపఁబడినది.

అప్పకవీయమునఁ గూడ దీనికి విభావవళి యనిపేరు. దీనిని తరుభయవళులలోఁ జేర్చెను.

## 15. సౌభాగ్య యతి

తే. ఉభయములుసెల్లు యతులు రెం డొకట పదము
నందు నెలకొన్న సౌభాగ్య యతి నెలంగుఁ

ప్రాంచి తామర వినుత వే దండ వరద
నాకరిపుశిక్ష శౌరి యన నంత యనఁగ. 11

(లక్షణ చూడామణి)

ఉభయయతి చెల్లునట్టి శబ్దములు రెండు ఒకే పాదమున నుండి వాని సంధిని వేఱు చేసినప్పుడు కనుపట్టు నచ్చులకు యతిమైత్రి చెల్లుటకు సౌభాగ్యయతి యనిపేరు.

పలు పద్యమునందలి మూఁడవ పాదమున

ప్రాంచి తామర వినుత వేద ండ వరద

ఇందు ప్ర+అంచిత=ప్రాంచిత అని విభాగము. పకార, రేఫము లకుఁగాని, వానిపైనున్న అకారమునకుఁగాని యతిమైత్రి చెల్లింపవచ్చుగాన ఇది ఉభయయతి చెల్లునట్టి శబ్దము. ఇట్లే వేదండ (వేద+అండ) అని విభాగము ఇందు దవర్ణమునకును, దానిపైనున్న అవర్ణమునకును యతిమైత్రి చెల్లింపవచ్చును. కావున నిదియు ఉభయయతి చెల్లునట్టి శబ్దము. ఇట్టి శబ్దములు రెండు ఒకే పాదముననుండి వాని సంధి విడఁదీసినప్పుడుండు అచ్చులకు యతిమైత్రి చెల్లింపఁబడినచో నది సౌభాగ్యయతి యనఁబడును.

ఇందు ప్రాంచితలో ప్రాలోని అకారమునకును, వేద+అండలో దవర్ణముపైనున్న అకారమునకును యతి చెల్లింపఁబడినది కావున నిది సౌభాగ్య యతి యగుచున్నది.

ఇట్లే నాక (న+అక) అనంత (న+అంత) అను ఉభయయతి శబ్దములలోని అచ్చులకు (అ, అ) యతిమైత్రి చెల్లింపఁబడినది కావున నిదియు సౌభాగ్యయతి యగుచున్నది.

క. భండనమున నెదిరిన రిపు
మండలముల నెల్లఁ గినిసి మర్దించి మదో

ద్దండుడై కవ్వడి మా
ర్తాండసుతుం దొడరి పోరె నాకులు మెచ్చన్. 119
(భారతము)

ఇక్లే మార్తాండ (మా ర్త+అండ) అనుదానిలోని అచ్చునకును నాకులు (న+అక) అనుదానిలోని అచ్చునకును యతిమైత్రి చెల్లింపబడినది కావున ఇదియు సౌభాగ్యయతి యగుచున్నది.

## 16. ప్రాసయతి

తే. పాకశాసన సుతుఁడు లోకైక వీరుఁ
డనఁగఁదగు ప్రాస విరతులి ట్లరులనేని
జారుతరహానకీర్తి ప్రచారుఁ డనఁగఁ
బ్రాసయతిగాదు, వర్గువు పంకజాక్ష! 120
(లక్షణ చూడామణి)

పాదమునందు ద్వితీయాక్షరము ప్రాసమనఁబడును. పాదాద్యక్షరమునకు మిత్రస్థానమున మైత్రిఁగూర్చక కొన్ని పద్యములందు యతిమిత్రస్థానమునకుఁ బ్రక్కఁ బ్రాసాక్షరమును నిలుపుట ప్రాసయతి యనబడును. ప్రాసయతికిఁ బ్రాసనియమములన్నియుఁ బట్టునుగాని యతిలక్షణము పట్టదు. ప్రాసయతి వృత్తములందుఁ జెల్లదు. గీతము, ఆటవెలఁది, సీసము—అను వానిలోఁ జెల్లును. లయగ్రాహి మున్నగు కొన్ని పద్యములందుఁ బ్రాసయతినే కూర్చవలయును.

పై పద్యమునఁ బ్రథమ పాదమునఁ బ్రాసయతి.

పాక శాసన సుతుఁడు లోకైక వీరుఁ

ఇది తేటగీతి పద్యపాదము. ఇందు యతి 'పా', యతిమిత్రస్థానము వాల్గవగణము మొదటి యక్షరము. అది కై లేక ఐ అయినది. పా—కై, ఐలకు యతిమైత్రి చెల్లదు. ఇట్లు యతిమైత్రి గుదురనిచోట ప్రాసయతి చెల్లింపవచ్చును. యత్యక్షరము ప్రక్కనున్న యక్షరము క కారము. అది ప్రాసము. యతి మిత్రస్థానము ప్రక్కనున్న యక్షరము గూడ కకారమే. అందుచేఁ బ్రాసయతి చెల్లిన దనవలయును.

మూఁడవ పాదమున

చారుతర హాసకీర్తి ప్రచారుఁ డనఁగ.

ఇదియుఁ దేటగీతి పద్యపాదము. ఇందు చారు-చారు అనుచో యతి మైత్రియుఁ గుదిరినది. ప్రాసయతియుఁజెల్లినది. గ్రంథకర్త యతి కుదిరి నప్పుడు ప్రాసయతిని గ్రహించరాదని చెప్పుచు ఇది వర్గయతియే యని చెప్పుచున్నాఁడు యతి కుదురనప్పుడే ప్రాసయతికవకాశముండునని యాతని యాశయమునట్లు తోఁచును. కాని యట్టిచో యతిమైత్రినిగాని, ప్రాసయతిని గాని గ్రహింపవచ్చునని కవుల ప్రయోగములను బట్టి గ్రహింపవచ్చును.

## 17 భిన్నయతి

**క. అంచిత తిలకము శౌరి ధ**
**రించె ననఁగ జగణమధ్య రేఫ విరతి యై**
**యంచిత తిలకము హరి ధరి**
**యించె ననఁగ భిన్నవడికి నిత్యము వచ్చున్. 121**

(అనంతుని ఛందము)

సంస్కృత ధాతువుల తుదిని 'ఇంచు' చేరి తెనుఁగున ధాతువు లగును. గురు విరహితములయిన యేకస్వర ద్విస్వర ధాతువులకుఁ జివర 'ఇంచు' చేరునపుడు ఇంచునకుఁ బూర్వము 'ఇయ్' అను అగమము వికల్పముగా నగును.

వచ్+ఇంచు=వచించు, వచ్+ఇయ్+ఇంచు=వచియించు అని రెండు రూపములగును. వచించు—ఇయు డాగమము రాని రూపము. వచియించు-ఇయుడాగమము అయిన రూపము.

ఇట్లే భుజ్+ఇంచు=భుజించు భుజ్+ఇయ్+ఇంచు=భుజియించు హృ+ఇంచు=హరించు, హరియించు, ధృ+ఇంచు=ధరించు, ధరియించు అని రెండేసి రూపములుండును.

ధరించు, హరించు, వచించు-అనునవి జగణము లగును. వీనిలో ఇంచుతోడి సంధియున్నను నడుమనున్న రేఫమునకే యతిమైత్రి గూర్పవలయును. అట్లుగాక ధరియించు, హరియించు అనురీతి ఇయుడాగమ సహితరూపములున్నప్పుడు ఇకారముతో యతిమైత్రిఁగుదుర్చవలయును.

ఇచ్చిన ధాతువు 'ధరించు.' అది జగణము. దానికి నడుమ 'రి' కలదు. కావున జగణ మధ్య రేఫమని లక్షణమునఁ జెప్పబడినది. నుతించు అన్నియున్నచో జగణమధ్య తివర్ణ మనవలయును. భిన్నశబ్దమునకు విడియుండుటయని యర్థము. ధరించు అని గాక ధరియించు అని భిన్న రూపము గలదై యున్నప్పుడు ఇకారమునకుఁ జెల్లుయతిగావున దానికి భిన్నయతి యనఁ పేరు వచ్చియుండనోపును.

పై పద్యమున రెండవపాదమున నున్న ధరించు అను దానిలోని 'రిం' అను దానికిని 'రే'ఫ అను దానిలోని 'రే' కును యతిమైత్రి కుదిరినది. నాల్గవపాదమున ధరియించు అని భిన్న రూపముతో నున్నప్పుడు 'ఇ'త్వము అని ఇకారముతో యతిమైత్రి చెల్లింపఁబడుటచేనది భిన్నయతి యగుచున్నది.

అప్పకవీయమున ఇయుడాగమము వచ్చినప్పుడు మధ్య నున్న ఇకారమునకు యతిమైత్రి చెల్లుచో భిన్నయతియనియు, ఇయుడాగమములాని యప్పుడు నడుమనున్న హల్లునకు యతిమైత్రిచెల్లుచోఁ బెఱయతి యనియు బేరులు గలవు.

## 18 ప్రాదియతి

క. ప్రపరాపసమను స్సు ప
త్యపి నిర్దు రధిన్యు పాభ్యు కె దాజ్ వ్యత్యవ వ
ర్యుపసర్గ దింశతకి వ
ళ్లుపరిస్వరయుక్తమైన కె నుభయము చెల్లున్. 121
(భీమన ఛందము)

ప్ర, పరా, ప్రతి, పరి, అతి, అధి, అభి, అవ, అను, ఉప, సమ్, సు, అప, ని, వి, నిర్, దుర్, ఉత్, అపి, ఆజ్ – అను నిరువదియు ప్రాదులనఁబడును. వీని మొదట 'ప్ర' ఉన్నది కావున ప్ర మొదలుగాఁ గలవి ప్రాదులనఁబడుచున్నవి. వీనికే ఉపసర్గలనియుఁ బేరు. ఈ ప్రాదుల కచ్చు పరమై సంధి జరగినప్పుడు అచ్చునకును, హల్లునకును - ఉభయమునకును యతిమైత్రి చెల్లును.

ఉదా. ప్రాణ బాంధవుఁడైన యప్పక్షి విభుఁడు. (నైషధము) ఇందు ప్ర+అన = ప్రాణ. ఇట్టిచో 'ప్ర'లోని పకార రేఫములకుఁ గాని, ఉత్తర పదాద్యచ్చునకుఁగాని యతిమైత్రి పాటింపవచ్చును. పయి పాదమున 'ప్ర'లోని పకారమునకును, పక్షిలోని పకారమునకును యతిమైత్రి చెల్లినది.

ప్రాణ సంకటమైన పుణ్యాంగనలకు
ఇందు ప్ర+అన = ప్రాణలోని అచ్చునకును, పుణ్య+అంగన లోని ఉత్తర పదాద్యచ్చునకును (అం) యతిమైత్రి కుదిరినది.

## 19. అభిన్నయతి

క. ఇంచి యును నచ్చుహల్లు ను
దంచితముగ సంధిఁ గూడు కె నవ్వు డభిన్నం

## భిన్నయతికి అభిన్నయతికి భేదము

క. భిన్నయతి జగణమధ్య, మ
భిన్నము దక్కిన గణాళిఁ జెంపెనసినచోఁ
భిన్నమున హల్లు చెల్లు, న
భిన్నమునకు రెండుఁ జెల్లు బీభత్సునకా! 125

ఇంచు గా గమ మయినప్పుడు జగణమధ్యమున నున్న (హరించు మున్నగువానిలోని) హల్లునకు యతిమైత్రి కుదురుట భిన్నయతి యనఁబడును. జగణము గాక తక్కిన గణములలో నున్నచో ఉభయయతి గూర్పవచ్చును. దీనికి అభిన్నయతి యని పేరు, 'పలికించు, పోషించు,' ఇత్యాదులు జగణములు గావు.

భిన్నయతి, అభిన్నయతి యని రెండు భేదములు చెప్పుటలోఁ బ్రయోజనము గానఁబడదు. 'హరించు, పోషించు,' ఇత్యాదులలో నెల్లను, ఉభయయతి చెల్లునని యభిన్నయతి వలన నేర్పడు చున్నది. 'ఇంచు' చేరిన సర్వధాతువులందు నుభయయతి చెల్లునని యొక్క భిన్నయతి క్రిందనే చెప్పినఁ జాలును.

మఱికొన్ని లక్ష్యములు.

క. పంచశరుండనఁగను చా
లించి మహాప్రథన భూమి నీక్షించి మదో
దంచితుఁడై శంఖముఁ బూ
రించెం గులఁగిరులు దిక్కరివ్రజ మడంగన్. 126

(ప్రద్యుమ్నోపాఖ్యానము)

———చా
లించి మహాప్రథనభూమి నీక్షించి మదో
ఇందు రెండవపాదమున 'చాలించి' అనుచోట ఇకారమునకు

చెప్పబడినది. ఇయుడాగము రానిచో నచ్చునకు యతిమైత్రి కుదుర దని చెప్పబడినది.

ఎదను లచ్చిని హతి ధరియించె ననగ - ఇది భిన్నయతి.

రి పునెల్లను బోర హరించె ననగ - ఇది పెఱయతి.

## 20. అభేదయతి

క. 'వపయో రభేద' యని యెదు
నెవమున పఫబభలు వాకు నేర్పున వడిగా
నుపమింపవచ్చుఁ గృతులం
దుపనిపదుచితార్థ సూక్తు లొలసిన చోటన్. 128

"వపయో రభేదః" అను శాస్త్రమును బట్టి వకార పకారములకు భేదము లేదు. కావున వ కారమునకు, "ప ఫ బ భ లతో యతిమైత్రి చెల్లును.

ఇట్లే లడయో రభేదః" అనియు, "రలయో రభేదః, అనియు శాస్త్రములు గలవు. కావున ల-డ లకు, ర-ల లకుఁ గూడ అభేదయతి చెల్లును.

ఇందులకు లక్ష్యము-

తే. లలిత వీణారవంబుతో డక్క-సరియె
రమ్యమణిరాజరాజితో లక్క- సరియె
భరిత భువనార్ణవంబుతో వంక సరియె
ననఁగను నభేద నామాఖ్య యతులు సెలఁగు 129

లలిత వీణా రవంబుతో డక్క- సరియె
రమ్యమణిరాజరాజితో లక్క- సరియె
భరిత భువనార్ణవంబుతో వంక సరియె

అనుచో మొదటి పాదమున ల-డ లకును, ద్వితీయ పాదమున ర-ల లకును, తృతీయ పాదమున భ-వ లకును యతిమైత్రి చెల్లినది.

## 21· వృద్ధి యతి

క. ఏకైకము సోదన నా
కౌకసులను శబ్దములకు నచ్చటి వడిగా
ఐకారౌకారంబులు
గైకొనఁ జను వృద్ధివళ్లు కవులాడఁబడఁగన్. 130

(కావ్యాలంకార చూడామణి)

సంస్కృత భాషలో అకారమునకు ఏ - ఓ లు పరములయి నప్పుడు క్రమముగా ఐ - ఔ లు వానికేకాదేశము అగును. ఐ-ఔ లకు వృద్ధియని సంజ్ఞ. కావున దీనికి వృద్ధిసంధి యనిపేరు. ఇట్టి వృద్ధిసంధి యందు ఆ దేశములయిన ఐకార - ఔ కారములకు వడుసగా ఏ కార - ఔ కారములు యతిమైత్రి చెల్లును.

శా. నీ కంఠార్పిత కాలపాశము, శిరో
నిర్ఘాత పాతంబు లం
కౌక స్సంచయ కాలరాత్రి గళ బ
ద్ధోదగ్ర కాలాహి క
న్యాకారాగత మృత్యువున్ జనక క
న్యన్ వేగ నొప్పించి లో
కైక త్రాణుని రాముని౦ గనుము నీ
కీ బుద్ధి గాకుండినన్

(భాస్కర రామాయణము

.................................లం

క్నౌక స్సంచయ కాలరాత్రి గల బద్ధోదగ్రకాలాహిక—

ఇందు లంకా+ఓకస్="లంకౌకస్" అని వృద్ధి సంధిచే ఔ కార మాదేశ మయినది. అట్టిచో సంధివిడఁ దీసినప్పు డుండు ఓ కారము నకును, సంధి కలిసినప్పుడుండు ఔ కారమనకును గూడ యతిమైత్రి చెల్లును. ఇచ్చట ఓ కారమునకు బద్ధోదగ్ర (బద్ధ+ఉదగ్ర) లోని ఉకార మునకు యతిమైత్రి చెల్లింపఁబడినది. అట్లే—

...............................లో

కై కత్రాణుని రామునిం గనుము నీ కీ బుద్ధి గాంకుండినన్.

లోక+ఏక=లోకైక అనునచో వృద్ధి సంధి వలన ఐకార మాదేశ మయినది. అట్టిచో సంధి విడఁదీసినప్పుడుండు ఏకారమునకును, సంధి కలిసినప్పుడుండు ఐకారమునకును యతిమైత్రి చెల్లింపవచ్చును. ఇందు 'ఏ'కారమునకు 'ఈ'కారమునకు యతిమైత్రి కుదిరినది.

## 22. నిత్యసమాసయతి

తే. పదము విభజించి చెప్పఁ జొ ౯ ప్పడని యుడియు
నన్యశబ్దంబుఁ గొని వి౯గ ౯ హంబుఁ జెప్పు
నదియు నిత్యసమాసమై ౯ యతులఁ గృతుల
నంటి సంధిని నచ్చు హ ౯ ల్లైన విరతి. 132

(అనంతుని ఛందము)

రెండు శబ్దములు కలిసి విభజించి చెప్పుటకు వీలుకాని యట్లొకే శబ్దముగాఁ దోఁచునట్టి సమాసము నిత్య సమాసము నిత్య సమాసమనఁ బడును. అట్టి నిత్య సమాసములం దుభయయతి (అచ్చుఁనకుగాని, హల్లు నకుఁగాని) యతిమైత్రి చెల్లును.

నాస్తి, అనంత, అనేక, నారాయణ, కర్ణాట, వనౌకస్, ద్వీప, అంతరీప-మున్నగునవి నిత్యసమాసములు.

న+అస్తి=నాస్తి, న+అంత=అనంత—ఇందు నకారమునకుఁ గాని, అకారమునకుఁగాని యతిమైత్రిఁ గూర్పనగును.

నార+అయన=నారాయణ-ఇందు విశిష్ట వర్ణమగు రేఫమునకుఁగాని, సంధిచేయుచేసినప్పుడు ఉత్తర పదాదినుండు అకారమునకుఁగాని యతి మైత్రిఁ గూర్పవచ్చును.

వనౌక శ్శబ్దమునకు లక్ష్యము —

క. శ్రీ కంఠుఁ డెదురునప్పుడు వ
నౌకోధ్వజ మింద్ర మకుట ♦ మర్జున తురగా
నీకము దివ్య శతాంగము
నా కప్పుడి కబ్బియున్న ♦ నతఁడే మనునో. 133
(అథర్వణ భారత విరాట పర్వము)

————————వ
నౌకోధ్వజ మింద్ర మకుట మర్జున తురగా—

వన+ఓకస్=వనౌకస్ ఇది వృద్ధి సంధి. ఇచ్చట సంధిలో వచ్చి ఔకారమునకు అర్జునతురగా అని అకారముతో యతిమైత్రి చెల్లింపఁబడినది. ఇట ఓకారమునకును యతిమైత్రిఁ గూర్పవచ్చును. విశిష్టవర్ణమగు 'నకారమునకును' (హల్లునకు) యతిమైత్రి కుదుర్పవచ్చును.

చ. నగి నగి యేనియున్ విను జనార్దన యెన్నఁడు బొంకుపల్కఁ.

జన+అర్దన=జనార్దన -ఇందు హల్లుతో యతిమైత్రి.

చ. అపుడు విరించిసూనుఁడు జనార్దను నెయ్యపు వాలుఁగంటె.

ఇందు స్వరమైత్రి చెల్లింపఁబడినది.

## ౨౩. ప్లుతయతి

క. ప్లుత మనఁబరఁగుఁ ద్రి మాత్రా
న్విత వర్ణము, దానిమీఁది ♦ విదిత స్వరముల్

కృతి నయ్యక్షరములు చనుఁ
జతురానన సదృశ వళ్ళ కే చక్కటి కెల్లన్. 134
(భీమన ఛందము)

హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని అచ్చు మూఁడు విధములు. ఏకమాత్ర కాలమున నుచ్చరింపఁదగినది హ్రస్వము. ద్విమాత్రాకాలమున నుచ్చరింపఁదగినది-దీర్ఘము. మూఁడు మాత్రలకాలములో నుచ్చరింపఁదగినది ప్లుతము. అట్టి ప్లుతము దూరాహ్వాన, సంశయార్థాదులందుఁ బ్రయోగింపఁబడును. దాని కుభయయతి (అచ్చునకును, హల్లునకును) చెల్లును.

క. దూరాహ్వానమునందు మ
హారోదన గాన సంశయార్థముల తుదిన్
జేరువ నగు నాద్యచ్చుల
నారూఢిం బ్లుతము వడి మహత్త్వము మెఱయున్. 135
(భీమన ఛందము)

దూరముగానున్న వారిని బిలుచుట, శోకించుట, సందేహము తెలుపుట మున్నగు స్థలములలో ప్లుతస్వరము వినఁబడును. ఇట్లు ప్లుతమున్నచోట హల్లునకును, ప్లుతస్వరమునకును యతిమైత్రి చెల్లింపవచ్చును.

ఈ గ్రంథమున దీనికి లక్ష్యములేదు.

ఉదాహరణలు—

మ. అకటా యేమని దూరుదాన నిను నాథా వేగుజామయ్యె...."

ఇందు "నాథా" అనుదానిలోని "ఆ" కారము దూరాహ్వానమును దెలుపును గాన ప్లుత మనఁబడును. ఇట్టిచో 'థ కార' హల్లునకుఁగాని, థకారము మీఁది ప్లుత స్వరమైన 'ఆ' కారమునకుఁగాని యతిమైత్రి చెల్లును. ఇందు స్వరమైత్రి చేయబడినది.

## 24. ఆదేశ యతి

క. ద్వీపమునకు నాకమునకు
నాపై శాస్త్రోక్తి నచ్చు కలాదేశ సమా
సాపత్తి గలుగుటయు వళు
లాపాదింపుదురు గొంద ఱచ్చును హల్లున్ 136

(కావ్యాలంకార చూడామణి)

ద్వి+అప్= అని యుండఁగ ఆకారమునకు ఈకార మాదేశమై 'ద్వీప' అగును. న+అక అని యుండఁగా సవర్ణదీర్ఘసంధి వలన ఆకార మాదేశమై 'నాక' అగును. ఇట్టిచో అచ్చునకును, హల్లునకును- ఉభయము నకును యతిమైత్రి చెల్లును. అనఁగా 'ద్వీ'లోని దకారమునకుఁగాని, వ కారమునకుఁ గాని, ఈ కారమునకుఁ గాని యతిమైత్రి చెల్లును. అట్లే నాక శబ్దములో నకారమునకుఁ గాని, ఆ కారమునకుఁగాని యతిమైత్రి చెల్లవచ్చును.

అప్పకవి దీనిని నిత్యసమానయతి యందే చెప్పెను.

ఇందులకు లక్ష్యము.

ఉ. ద్వీపులఁ ద్రుంచి విశ్వ జగ
తీ ధరుఁ డుత్తమమైన జాంబవ
ద్వీపము నందు గోవులకు
నిమ్ముగఁ జేయుటయుం బ్రసిద్ధమై
గోపతి ధేను వవ్విభున
కున్ ధనమిచ్చిన నిచ్చఁగాక యే

భూపతు లివ్వదాన్యగుణ
బుద్ధిఁ బ్రసిద్ధి వహించి దుర్వ్వరన్ 137

(కావ్యాలంకార చూడామణి)

ఉ. ద్వీపులఁ ద్రుంచి విశ్వజగతీ ధరుఁ డుత్తమ మైన జాంబవ
ద్వీపమునందుగోప్యులకు నిమ్ముగఁ జేయుటయుం బ్రసిద్ధమై

(ద్వీ-తీ),

ఇందు మొదటి పాదమున హల్లునకును (ద్వీ-తీ), రెండవ పాదమున (ద్వీ-ఇ) అచ్చునకు యతిమైత్రి.

క. నీ కరవాల నిహతులై
నాకంబున కేఁగి రాజ నారాయణ! యా
భూకాంతు లెంత చలమో
నాకవిటోత్తములఁ దూల నాడుదు రెలమన్ 138

(కావ్యాలంకరణ చూడామణి)

నాకంబున కేఁగి రాజ నారాయణ యా

ఇందు నాక శబ్దములోని నకారమునకు (హల్లునకు) యతిమైత్రి చెల్లినది.

నాక విటోత్తములఁ దూల నాడుదు రెలమిన్

ఇందు నాక శబ్దములోని అకారమునకు (తూలన్+అదు) అను దానిలోని 'ఆ' కారమునకు యతిమైత్రి చెల్లినది.

ఉ. ఓ కమలాక్ష! వింటివె సు
యోధనుతోఁ గురుసేన లెల్లఁ జీ
కాకు పడంగ ధర్మజుఁడు
కౌతుకమందఁగ నీవు మెచ్చఁగా

నాకవిభుండు లేఖలతి
యచ్చెరుపాటున నన్నె చూడ నే
నే కమలాప్త పుత్త్రి వధి
యించెదఁ గార్యము నిర్వహించెదన్ 139

(భారతము)

ఉ. నాకవిభుండు లేఖలిత యచ్చెరుపాటున నన్నెచూడ నే

ఇందు నాక శబ్ద న కారము మీఁది అచ్చుతో యతిమైత్రి చెల్లింపఁ బడినది.

న+అక=నాక, అచ్చెరుపాటు

## ౨౮. వికల్ప యతి

తే. హయుత వర్గువులు వికల్ప యతులఁ జెల్లు
దేవకీ నందనుఁడు జగద్ధితుఁ డనంగ
హాలధరుఁడు సంగరాంగణో ద్ధతుఁ డనంగ
నవని మోచినయవి కకు బ్భ లగఁగ 140

(అనంతుని ఛందము)

క-చ-ట-త-ప లకుఁ బరమయిన హ కారమునకుఁ గ్రమముగా ఘ-ఝ-ఢ-ధ-భ లు వికల్పముగా నాదేశములగును. ఇది వికల్ప సం

వాక్+హరి — వాగ్ఘరి, వాగ్హరి అను రీతిని రెండురూపములుండు

ఇట్టిచో ఆదేశ ఘకారమునకుఁ గాని, వా స్థానియగు హ కారమునకుఁ యతిమైత్రి చెల్లవచ్చును.

పై పద్యములో రెండవ పాదమున
దేవకీ నందనుఁడు జగద్ధితుఁడనంగ

'దే'+కును, జగత్+హిత=జగద్ధిత ఆదేశ 'ధ' వర్ణమునకును యతిమైత్రి

హాలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ.

ఇందు హ కారమునకును, ఉత్+హతు - స్థానియగు హకారము నకును యతిమైత్రి

నాల్గవ పాదమున అవని———(కకుప్+హస్తి)-కకుబ్భస్తి

ఇందు స్థానియగు హకారమునకు యతిమైత్రి చెల్లినది.

క. నుతకీర్తి వడసి సుజన ప
ణితులై వర్ధిల్లు దుష్ట నిగ్రహ శిష్ట
ప్రతిపాలకులై త్రిజగ
ద్ధితముగ నేలంగఁ దగు మహీతల మెల్లన్. 141

(దశకుమార చరిత్రము)

———————త్రిజగ
ద్ధితముగ నేలంగఁదగు మహీతల మెల్లన్.

జగత్+హిత=జగద్ధిత- ఇందు స్థానియగు 'హి' యనుదానికి 'మహీతల' లోను 'హీ' యనుదానికి యతిమైత్రి చెల్లినది.

## 26. కాకుస్వరయతి

తే. వరున దీర్ఘాంతసంబుద్ధి వచన యతుల
కమరుఁ గృతులందుఁ గాకుస్వరము నహ్ర
నామ శోభిత గోప కృష్ణాయనంగ
నమరవందిత గోప కృష్ణాయనంగ. 142

(అనంతుని ఛందము)

సంబోధనమునందు వచ్చు దీర్ఘాంత స్వరము కాకుస్వరమనఁబడును. ఇట్టిచోట నుభయయతి (అచ్చునకును, హల్లునకును) చెల్లును.

నామ శోభిత గోప కృష్ణా యనంగ

అనుచోట కృష్ణాయను సంబోధనమున్నది. ఇందలి ఆకారము కాకుస్వరము. కావున 'ష్ణా'లోని షకారణ కారములకుఁగాని, ఆకారమునకుఁగాని యతిమైత్రి చెల్లవచ్చును.

పయి పాదమున 'నా' అను హల్లునకును, 'ష్ణా'లోని 'ణ' అను హల్లునకును యతిమైత్రి చెల్లినది.

అమరవందిత గోపకృష్ణా యనంగ

ఇందు అకారమునకు ష్ణాలో కాకుస్వరమైన ఆ కారమునకు యతిమైత్రి చెల్లినది.

క. కాకుస్వర యతులగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగ, బ్ర
హ్మాకలిత దీర్ఘమగు నితఁ
డే కవ్వడి రథముఁ గడపె నిర్మ్మూలననఁగన్. 148
(అనంతుని ఛందము)

——————ఇతఁ

డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ్ర

ఏ వార్థకమునందును, ప్రశార్థకములందును దీర్ఘ స్వరము వచ్చును. ఇదియును కాకుస్వరమనఁబడును. కావున నిందుభయయతి చెల్లును.

పైపద్యమున ఇతఁడు+ఏ-అని ఏవార్థక కాకుస్వరము గలదు ఇచ్చట 'డే' అను హల్లునకు పవ్వళించె అనుదానిలోని 'ళిం' వర్ణమునకు యతిమైత్రి చెల్లినది.

ద్రై కవ్వడి రథముఁ గడపె నిమ్ములననఁగన్

ఇందును ఇతఁడు+ఏ అని ఏవార్థక, కాకుస్వరము గలదు. ఇచ్చట కాకు స్వరమగు ఏ అనుదానికిని, 'ఇమ్ముల'లోని ఇకారమునకును యతి మైత్రి చెల్లినది.

## 27 రివడి

క. విలసదృకారమ్మును మఱి
రిలవి విరమ మొందు శౌరి కి ఋషులకు శశ్వ
త్ఫలభుఁ డనఁగ ఈ విలకుఁ
దలఁపఁగ రీతోడి విరత కి దలకొన దెందున్. 144

(అనంతుని ఛందము).

ఋకారమునకును, ఇ,ఈ,ఎ,ఏలతోఁగూడిన రేఫమునకును యతి మైత్రి చెల్లుట రివడి యనఁబడును. పై పద్యమున రెండవపాదమున

రిలవి విరమమొందు శౌరి ఋషులకు శశ్వత్

రివర్ణమునకు ఋకారముతో యతిమైత్రి చెల్లినది.

అప్పకవీయమున దీనికి ఋవళి యనిపేరు.

## 28. అఖండయతి

ఉ. మానుగ విక్రమాక్షర న
మన్వితమై స్వరమూఁదినం దదీ
యాను గుణాక్షరం బె కొని
మైనను జెప్పఁగవచ్చు నీ క్రియన్

భాను సహస్రభాసి వృష
భాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండయతి
పొల్పగు నాది కవి ప్రణీతమై, 145

(భీమన ఛందము)

పాదాదియందుఁ గాని, యతిమైత్రి స్థానము నందుఁ గాని అచ్సంధి యేర్పడి పూర్వ పదాంత హల్లుతో నుత్తరపదాది స్వరము చేరియున్నచో దానిని అఖండ శబ్దముగా (ఏక శబ్దముగా) భావించి సంధి స్థానమున నున్న హల్లునకు యతిమైత్రిఁ గూర్చుట అఖండయతి యనఁబడును.

పై పద్యమున మూఁడవ పాదమున యతిమైత్రి స్థానములో 'వృషభ+అధిప' అను సవర్ణదీర్ఘ సంధి గలదు. దీనిని అఖండశబ్దముగా భావించి వృషభాధిప శబ్దములోని 'భ' కారముతో యతిమైత్రి చెల్లింపఁ బడినది. భానుసహస్ర భాసి వృషభాధిపు........

ఇందులకు లక్ష్యము-

ఉ. అన్నవు తండ్రి యట్ల విను
మంతియ కాదట మీఁద రాజ వే
మన్నఁ గొలంత లేదు మణి
మండన ముఖ్యము లైన కానుకల్
మున్నగ సీత నిచ్చి జన
లోకపతిం గని నన్నుఁ బ్రోవు మీ
వన్నువుఁ గార్యము ల్వలదు
నందియమే లటుగాక తక్కనన్ 146

(భాస్కర రామాయణము)

ఏ - మన్న౯ గొఱంతలేదు మణిమండన ముఖ్యములైన కానుకల్

ఇందు ఏమి+అన్న = ఏమన్న ........ మణిమండన అనుచో సంధిలో నిలిచిన మ అను హల్లుతో యతిమైత్రి చెల్లినది.

దీని నిటీవలి కవులు తప్పుగా వాడుచున్నారు. అచ్చంధి యున్న చోట్ల నెల్ల హల్లునకు యతిమైత్రి చేయవచ్చు నన్నచో, నిఁక స్వరప్రధాన వళితోఁ బని యుండదు.

సంధి కలిసినప్పుడు రెండు భిన్న పదము (ఖండము) లయ్యును, ఎక్కడ అఖండముగా భావింపఁబడునో అక్కడ మాత్రమే అచ్చునకును, హల్లునకును - ఉభయమునకును యతిమైత్రి చెల్లును. దీనికే అఖండయతి యనిపేరు. అఖండముగా భావించుటకు వీలులేనప్పుడు ఉత్తర పదాద్యచ్చునకే యతిమైత్రి చెల్లింపవలయునుగాని, పూర్వపదాంతహల్లునకు చెల్లింపరాదు.

ఉదా.

పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు వానస ధర్మామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడున్ దనకిష్టుఁడున్....

నారాయణ శబ్దములో నార+అయన అను రెండు ఖండములున్నను, సంధి యేర్పడి నారాయణ అని అఖండ పదముగా భాసిల్లుచున్నది. ఇందులో అచ్చునకుఁ (అ) గాని, రేఫమునకుఁ గాని యతిమైత్రి చెల్లింపవచ్చును.

రెండవ పాదమున నా-రాయణు నట్లు........ధరామర (ధరా+అమర) అని అచ్చునకు యతిమైత్రి పాటింపబడినది. మూఁడవ పాదమున నారాయణ శబ్దము నఖండముగా భావించి రేఫమునకు — నా-రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడున్........యతిమైత్రి పాటింపఁబడినది.

మఱి-

భాను సహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు........

అనుచో వృషభాధిపుఁడు (వృషభ+అధిపుఁడు) అనురీతిని రెండు ఖండములుగా భావింపఁదగును గాని అఖండముగా నెట్లు భావించనగును? అట్టిచో హల్లునకు యతిమైత్రి యెట్లు కుదురును? అనవచ్చును. అవును దీని నేక పదముగా భావించుటకు వలను పడదు. వృషభ+అధిప—అన్న ప్పుడు 'అధి' అను నుపసర్గములో నియాద్యచ్చునకు సంధి కలిసినది కావున విచ్ఛే నఖండయతి చెల్లునని సమాధానము.

క. పూనుకొని యక్ష శబ్దము
పై నూహిని శబ్దమున్నఁ గ బటు వృద్ధి యగుఁ
మానుగ గుణముం జెల్లును
దాన నఖండంబు స్వరము గ దనరున్ గృతులన్ 147

అక్ష+ఊహిని అనుచో నిచ్చట గుణసంధియై అక్షోహిణి కావల యును. గుణము రానియప్పుడు వృద్ధి సంధియై అక్షౌహిణి యగును. ఈ రెండు రూపములందును స్వరములకే కాక, హల్లులకును యతిమైత్రి చెల్లును.

ఆ. లక్షణాన్వితముగ గ నక్ష శబ్దంబుపైఁ
దనర నూహినను ద గ దంబు వెలయు
నపుడు వృద్ధిసెప్ప గ నగు గుణంబును జెల్లు
నాగుణం బఖండ గ మై చెలంగు. 14

(కవిజన సంజీవని

పై భావమే ఇందును గలదు.

స్వరమైత్రి కుదాహరణములు.

ఉష్ణ కర సూనుఁ డయ్యె నక్షౌహిణీశు

ఇందు అక్షౌహిణియని వృద్ధి సంధియైన రూపము గలదు. ఉ అను నచ్చునకును అక్షౌహిణిలోని ఊ అను నచ్చునకును యతిమైత్రి కుదిరినది. ఇచ్చట స్వరములకు యతిమైత్రి కుదిరినది.

అట్ల కల్యాండు నాథుఁ డక్షౌహిణులకు

ఇందును వృద్ధి సంధియైన రూపమే కలదు.

'అ' అను నచ్చునకును అక్షౌహిణిలోని ఔ కారమునకును స్వర మైత్రి కుదిరినది.

హల్మైత్రి కుదాహరణములు.

క్షూరిమి వెలయ నక్షోహిణిపైఁ గొంత (భారతము)

అక్ష+ఊహిని=అక్షోహిణి యని గుణసంధియైనది. ఇందు క్షూ-క్షో—అను హల్లులకు యతిమైత్రి కుదిరినది.

సందడింపుచు దశాక్షౌహిణీ సైన్యంబు (జైమిని భారతము)

ఇందు సం....క్షౌ అని హల్లులకు యతిమైత్రి చెల్లినది.

## 29. ఉభయయతి

తే. యుష్మ దస్మ దనెడు నుభయంబునకుఁ బొల్చు
నచ్చు గూడి ద్వివిధ మయ్యె విరతి
తరమె కృష్ణ యుష్మ దవతారకథనంబు
లభినుతింప నస్మ దాదులకును. 149

యుష్మద్, అస్మద్ అనువానికి అచ్చుతో సంధియైనప్పుడు హల్లునకును అచ్చునకును ఉభయమునకును యతిమైత్రి చెల్లును.

దీని నప్పకవి యుష్మదస్మచ్ఛబ్దయతులని పేర్కొనెను.

తరమె కృష్ణ యుష్మ దవతార కథనంబు

అనుచో యుష్మద్+అవతార=యుష్మదవతార అని ఏర్పడును.

ఇక్కడ హల్లులకు త్త....ద్ద యతిమైత్రి కుదిరినది.

అభినుతింప నస్మద్దాదులకును.

ఇందు అస్మద్+ఆదులు=అస్మదాదులు అయినది.

ఇందు అచ్చులకు అ....ఆ యతిమైత్రి కుదిరినది.

## 30 యవర్గయతి, 31 శవర్గయతి

**య శ వర్గ ద్వయమునకును**
**విశదము దమ యక్షరములు వెలయఁగ వళ్ళౌఁ**
**గుశలమగు పదము ధరలో**
**శ్రీ నొదలఁ దాల్చు నతఁడు హారుఁ డను మాడ్కిన్.150**

య-ర-ల-వ అనునవి అంతస్థములు. శ, ష, స, హ అనునవి ఊష్మము లనఁబడును. అంతస్థములు తమలోఁదాము పరస్పరము యతిమైత్రి చెల్లుననియు, అట్లే ఊష్మములును తమలోఁదాము యతిమైత్రి చెల్లుననియును ఈ లక్షణము చెప్పుచున్నది. అంతస్థములకుఁ జెల్లు యతి అంతస్థ యతి యనియు, ఊష్మములకుఁజెల్లు యతి ఊష్మయతి యనియుఁ బిలువఁబడును.

పై పద్యమున నాల్గవ పాదమున

శ్రీ నొదలఁ దాల్చు నతఁడు హారుఁ డను మాడ్కిన్

ఇందు శ-హ లకు యతిమైత్రి చెల్లింపఁబడినవి.

కాని యిది యప్రశస్తము. అందుచే నగ్రాహ్యము. అప్పకవి దీని నగ్రాహ్యయతులలోఁజెప్పినాఁడు.

## 32. జ్ఞా వడి

గీ. అప్రసిద్ధము జ ఞ లు శక్ష్యాదియందు
ఞా జ సంయుక్త తద్భవ కవ్యాజమునను
నణలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ
జలరుహాక్షాశ్రితులును సుజ్ఞానులనఁగ 151

(అనంతుని ఛందము)

జ, ఞ కారములు పదాది నుండవు. జకార ఞ కారములు సంయుక్తమై జ్ఞ అని సంస్కృత పదము లందుండును. తద్భవములందు జ్ఞకారమునకు న కార మగును. ఆజ్ఞ—ఆన—అందుచే జ్ఞకార న కారములు పరస్పరము యతిమైత్రి నందును. న-ణ లు మిత్రములు గావున ణ కారమును 'జ్ఞ'కు మిత్ర మగును.

పై పద్యమున మూఁడవ పాదమున

నణలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ న-జ్ఞ లకు యతిమైత్రి చెల్లినది.

నాలుగువ పాదమున

జలరుహాక్షాశ్రితులును సుజ్ఞాను లనఁగ

ఈ యతి మైత్రి సరియైనదే—కాని జ్ఞా వడి మాత్రముగాదు. ఇది సంయుక్తాక్షర యతి.

| తత్సమము | | తద్భవము |
|---|---|---|
| యజ్ఞము | — | జన్నము |
| ఆజ్ఞప్తి | — | ఆనతి |
| ఆజ్ఞ | — | ఆన |
| సంజ్ఞ | — | సన్న |
| విజ్ఞాపనము | — | విన్నపము |

ఇట్లు తత్సమములోని జ్ఞ కారము తద్భవమున న కారమగును.
న జ్ఞ కార న కారములు యతిలో మిత్రము అయ్యెనని తెలియు
ను.

పలకు సాక్ష్యము—

శ్రీలలనా తనూభవ వి
    శేష జగన్మయమూల మన్మథా
జ్ఞాలతికాలవాల రతి
    నాథ కరాళ మదాంధ గంధ శుం
డాల విలోల తద్భుజిక
    నత్కరవాల విశాల శుభ్రవా
తూల మదీయకాంత ధృతి
    దూలఁగ నేఫున పీవకుండుమీ    152

———————మన్మథా

జ్ఞా లతికాలవాల రతినాథ కరాళ మదాంధగంధ శుం

ఇందు 'జ్ఞా'కును 'నా'కును యతిమైత్రి చెల్లినది.

## 33. సరసస్వర యతి

క. ఇరుగడల వ్రాల్లునొందిన
నొరపుగ నొకచోటఁ బొందికై యున్నను స్వరమా
విరసముగ నచ్చులున్నన్
సరస విరామంబ టండ్రు కై జలరుహనాభా!    153

పాదాది యందుఁగాని, యతిస్థానమునందుఁగాని లేక రెండు స్థలము లందుఁగాని అచ్సంధియందుఁ బూర్వహల్లుతో మీఁది యచ్చు చేరి యున్నప్పుడు ఆ యచ్చు మఱియొక్క యచ్చుగా (విరసముగా) మాఱియున్నను, రెండవ పదము మొదటి యచ్చునకు యతిమైత్రి చెల్లును. అచ్సంధి జరిగి నప్పుడు పరాపదాద్యచ్చునకే యతిమైత్రి చెల్లునని తెలియవలెను.

అప్పకవి దీనికి స్వరప్రధాన వడియని పేర్కొనినాఁడు.

గీ. ప్రాదినిత్య సమాస శబ్దములు గాక
పెఱ పదంబులపై నచ్చు చెరసినప్పు
డన్నియును స్వరయతులగు సాంబగురుఁడ
యింద్రుఁడమరాన్వయాబ్ధిపూర్ణేందుఁ డనఁగ. 154

(అనంతుని ఛందము)

సాధారణముగా అచ్సంధి జరిగినప్పుడు పరపదాద్యచ్చునకే యతి ౖత్రి చెల్లవలయును. ప్రాది, నిత్య సమాసములందు మాత్రము అచ్సంధి ిగినను నుభయయతి (అచ్చునకుఁగాని, హల్లునకుఁగాని యతి) చెల్లును. ాది నిత్య సమాస శబ్దములఁ దక్కఁ దక్కిన యచ్సంధి జరిగినచోట్ల ెల్లి స్వరయతి (సరస స్వరయతి, స్వర ప్రధానవడి)యే చెల్లునని పయి పద్యమునందలి లక్షణము.

ప్రాది నిత్య సమాసములే కాక స్వరవ్యంజనోభయయతి, శకంధ్వాది, ఆదేశ, దేశీయ, నిత్య, ప్రభు, విభాగ, కాకు, ప్లుతవడుల యందును నుభయయతి చెల్లునని యీ గ్రంథము వలనఁ దెలియనగును. పయి లక్షణమునఁ బ్రాది నిత్య సమాస—అనక ప్రాదినిత్య సమాసాది అన్నచో నిట్టి విశాలార్థమున కవకాశముండును.

మూడవపాదము— అన్నియును స్వరయతులగు సాంబగురుఁడ
అన్ని— స్సాంబ (స+అంబ)

ఇంద్రుఁ డమరన్యాయాబ్ధి పూర్ణేందుఁ డనఁగ

ఇం————పూర్ణ+ఇందు

సాంబ శబ్దమున సవర్ణదీర్ఘ సంధియు, పూర్ణేందు శబ్దమున గుణ సంధియుఁ గలవు. రెండు చోట్లను బరపదాది స్వరమునకే యతిమైత్రి ఘటింపఁబడుట చూడనగును.

## 34. లుప్త విసర్గక స్వరయతి

తే. స్వరము తుదనుండి లుప్త వి
సర్గకోత్వ
మైన స్వరవిరామంబు దా
సోఽహమనఁగ
నచ్యుతాశ్రితు లుర్వి న
న్యోన్యమిత్రు
లన ముకుందుండు విమల య
శోఽర్థి యనఁగ 155

(అనంతుని ఛందము)

సంస్కృతములో హ్రస్వమైన ఆకారము మీఁది విసర్గమునకు హ్రస్వమైన అకారము పరమగునప్పుడు, ఆ విసర్గమునకు ఉకార మాదేశమై, పూర్వ 'అ'కారముతో గుణసంధియై ఓకార మాదేశమగును.

ఉదా : దాసః+అహమ్ దాసోఽహమ్.

యశః+అర్థి — యశోఽర్థి.

అన్యః+అన్యః - అన్యోన్యః

ఇట్టి విసర్గమున కాదేశమైన ఓకారమునకు అకారముతో యతి మైత్రి చెల్లుననుట లుప్త విసర్గక స్వరయతి యనఁబడును.

ఉదా : ఐన స్వర విరామంబు దాసోఽహ మనఁగ

అచ్యుతాశ్రితులుర్వి నన్యోన్య మిత్రు

విసర్గము లోపించి వచ్చిన ఓకారమునకు స్వరముతో మైత్రి గలుగుటచే లుప్త విసర్గక స్వరయతి యనుపేరు వచ్చినది.

## 35. నిత్యయతి

ఆ. ఏని యనుబదంబు తో నాదివిధమంది
సంధి నిత్యయతుల జరుగుచుండు
నెట్టి క్రూర కర్ముఁ డేని సద్గతి నొందు
నిన్ను నాత్మఁ దలఁచె నేని కృష్ణ 156

(అనంతుని ఛందము)

ఏని శబ్దము పరముగా సంధి యేర్పడినప్పుడు అచ్చునకు, హల్లునకు (ఉభయమునకు) యతిమైత్రి చెల్లును:

ఎట్టి క్రూరకర్ము డ్డే ని సద్గతి నొందు.

పయి పాదమునందు క్రూరకర్ముఁడు+ఏని అని యుండఁగా నిత్య సంధి జరిగి క్రూరకర్ముఁ డేని అగును. ఇట్టిచో 'డే' అను హల్లునకుఁగాని దానిపై నున్న 'ఏ' అను నచ్చునకుఁగాని యతిమైత్రి చెల్లును. ఇంచు ఎ....ఏ అని అచ్చులకు యతిమైత్రి చెల్లినది.

నిన్ను నాత్మఁ దలఁచె నే ని కృష్ణ

ఈ పాదమున తలఁచెన్+ఏని అని యుండఁగా పదములు గూడి తలఁచె నేని అగును. ఇంగు 'ని' అను హల్లునకును 'నే' అను హల్లునకు యతిమైత్రి కుదిరినది.

## 36. అనునాసిక వికల్ప యతి

గీ. వలిఁ గకార హల్లికిత రాను నాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వి కల్పవిరతి
గలుగుఁ జక్రివల్లవ సుద్భ బ్జ్మథుఁ డనఁగఁ
గమల నేత్రుండు సకల ది బ్జ్మహితుఁడనఁగ. 157

సంస్కృతమున కకారమునకు అనునాసికము పరమగునపుడు జ కారము వికల్పముగా నాదేశమగును.

దృక్+మథ — దృఙ్మథ, దృగ్మథ

దిక్+మహిత —దిఙ్మహిత, దిగ్మహిత.

ఇట్లు ఆదేశమయిన అనునాసికమునకుఁ (ఙకారమునకు) గాని, లోపించిన కకారమునకుఁ గాని యతిమైత్రి చెల్లింపవచ్చును.

పై పద్యమున మూఁడవ, నాల్గవ పాదములందు లోపించియున్న కకారముతో యతిమైత్రిఁ చేయఁబడినది.

కలుగు ........ దృఙ్మథ (దృక్+మథ)

క్రమల ........ దిఙ్మహిత (దిక్+మహిత)

'దిఙ్మహిత అనుచోట కకారమునకే కాక, ఙ కార మకారములకును యతిమైత్రిఁ గూర్పవచ్చును.

క. మగతనముఁ జూపఁజాలక
మగఁటిమి చెడి విఱిగి పాఱు కురు సైన్యములో
జగదత్యుఁడు రుచిచేఁ బ్రా
ఙ్నగమున వెలుఁగొందు రీతిఁ గవ్వడి పొలిచెన్. 158

ప్రా-ఙ్నగమున వెలుఁగుందు రీతిఁ గ వ్వడి పొలిచెన్.

ఇందు ప్రాక్+నగము=ప్రాఙ్నగము, ప్రాగ్నగము అని రెండు రూపము లేర్పడును. ఇందు లోపించిన కకారముతో మిత్ర స్థానమున నున్న కకారమునకు (కవ్వడి లోనిదానికి) మైత్రి కుదిరినది.

గమనిక : ఈ గ్రంథమున ఒక్క కకారమునకు మాత్రమే అనునాసిక వికల్పయతి చెప్పఁబడినది. కాని క, చ, ట, త, ప ల కన్నింటికి అనునాసిక వర్ణము పరమగునపుడు వచ్చు నా యా యనునాసికములకే యతిమైత్రి చెల్లునని యెఱుఁగునది. ఉదాహరణము

సరి-న్నికటానేక వన ప్రదేశముల దైత్తే యేంద్ర....సోమన హరివంశము ఇందు సరిత్+నికట అని తవర్ణమునకు 'ని' అను అనునాసికము పరమగుచున్నది. అప్పుడు సరిన్నికట, సరిద్నికట అని రెండు రూపములు ఏర్పడును.

ఇట్టిచో తకారమునకుఁగాని నకారమునకుఁగాని యతిమైత్రి చెల్లింపవచ్చును. ఇందు 'త'కారమునకు యతిమైత్రి చెల్లినది.

## 37. ఌకారయతి

తే. మును ఋకార మిఏలతోఁ నొనరినట్లు
చేర దొరకట యణాదేశ కారణమున
ఘన లకారంబ యగును ఌకార విరితి
కౢప్తిలేదు శౌరి గుణావళికి ననంగ. 159

(అనంతుని ఛందము)

రివడిలో ఋకారమునకు ఇ-ఈ-ఎ-ఏలతోఁగూడిన రివర్ణమునకు యతిమైత్రి చెల్లును. అట్లే ఌకార యతిలో ఌకారమునకు ఇ ఈ ఎ ఏ లతోఁ గూడిన లకార ళకారములతో యతిమైత్రి చెల్లును.

కౢప్త శబ్దములోని కౢ అను దానికి లి-ళి అను దానితో యతిమైత్రి చెల్లును.

కౢప్తి లేదు శౌరి గుణావళికి ననంగ.

కౢ—ళి అను వానికి యతిమైత్రి చెల్లినది.

అప్పకవీయమున నీ యతి చెప్పఁబడలేదు.

## 38. పరరూపయతి

తే. స్వాంత వేదండ మార్తాండ శబ్దములకు
యతులు నుభయంబులగు బుధ స్వాంతములకు
నతి సుఖావహుం డెపుడు వేదండవరదు
డనగ హరి దైత్యతిమిర మార్తాండుం డనంగ 160
(కవిజన సంజీవని)

సంస్కృతమున శకంధ్వాదులను నొక గుణము గలదు. శక+అంధు(వు) అని యుండగా సవర్ణదీర్ఘ సంధి జరిగి శకాంధు(వు) అను రూపము కావలయును. కాని వీనిలో సవర్ణ దీర్ఘసంధి జరుగక పరరూప సంధి జరగును. అనగా పరపదాది స్వరము చేరును. శకంధువు అగును. ఇట్లే మనస్+ఈషా=మనీషా. సీమ+అంత=సీమంత. వేద+అండ=వేదండ. మార్త+అండ=మార్తాండ అనునవి యన్నియు శకంధ్వాదు లలోం జేరును. వీని కన్నింటికిని-అచ్చునకును, హల్లునకును ఉభయమ నకు యతిమైత్రి చెల్లును.

స్వాంత శబ్దము శకంధ్వాదులలోం జేరదు. ఏలన ఇందు స్వ అంత అనియుండగా సవర్ణ దీర్ఘసంధియే జరిగినదికాని పరరూపసం జరుగలేదు. శకంధ్వాదులలోం జేరకున్నను నిత్య సమానయతిచే 'స్వా' లోని అచ్చునకును, హల్లునకును ఉభయమునకు యతిమైత్రి చెల్లును.

స్వాంత వేదండ మార్తాండ శబ్దములకు
అనుచో హల్లునకు యతిమైత్రి చెల్లినది
యతులు నుభయంబులగు బుధస్వాంతములకు
ఇందు అచ్చునకు యతిమైత్రి చెల్లినది
అతి సుఖావహుం డెపుడు వేదండ వరదుం
ఇందును అచ్చునకు యతిమైత్రి చెల్లినది

అనఁగ హరి దైత్య తిమిర మార్తండుఁ డనఁగ
అనుచోఁగూడ అచ్చునకే యతిమైత్రి చెల్లినది

వే - దండ ముఖాంగముల్ తృణవితానముగాఁగొని నిర్వికారులై
(భారతము)

ఇందు 'దం'లోని దకారమునకు (హల్లునకు) యతిమైత్రి చెల్లినది

ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తండుండు....భారతము

ఇందును 'ర్తం'లోని తకారమునకు హల్లునకు యతిమైత్రి చెల్లినది.

## 39. ఱావడి

క. ధారుణి ఱావడి యనఁదగు
ఱా రేఫకు రేఫ ఱాకు రహి వడిఁ దనరున్
నీరమ్యకీర్తి నగుఁ దా
రారజక్ నలువబలుగు ఱాలుననంగన్. 161

సాధురేఫ (ర) శకటరేఫములకు (ఱ) పరస్పరము యతిమైత్రి
కూర్చుట ఱావడి యనఁబడును.

ఈ యతి విషయమున లాక్షణికులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఱలకు యతిమైత్రిగాని, ప్రాసమైత్రిగాని చెల్లదని కొందఱును; యతి మైత్రి చెల్లవచ్చునుగాని ప్రాసమైత్రి చెల్లదని కొందఱును, రెండును జెల్ల వచ్చునని కొందఱును-ఈ విధముగా భిన్నమతములు గలవారై యున్నారు

పై పద్యమున రెండవపాదమున ఱా- ర అనువానికి యతిమైత్రి చెల్లినది. నాల్గవ పాదమునను రా—ఱా అనువానికి యతిమైత్రి చెల్లినది.

క. తెంపును బెంపును గదుర ని
లింపులు వెఱఁగంది చూడ రిపు సైన్యములం

గంపింపఁ దనబలంబులు
అంపిలి బిట్టార్వ సింధు రాజుం డాఁకెన్. 162
(భారతము)

అంపిలి బిట్టార్వ సింధు రాజుం డాఁకేన్
ఈ పాదమున అ-రాలకు యతిమైత్రి చెల్లినది.

## 40. ప్రాసములు

క. స్వరనియతి లేదు ప్రాసకు
సరయఁగ నేయక్షరమున నా యక్షర మే
వరువడి నిలుచును నాలుగు
చరణంబులఁ గృతులయందు సమ్యక్ఫణితిన్. 163

పద్యపాద ద్వితీయాక్షరము ప్రాసము. ఇంకనుసూటిగాఁ జెప్ప వలయు నన్న పాదమునందలి మొదటి యచ్చునకును, రెండవ యచ్చునకును నడుమనున్న హల్లుగాని, హల్సముదాయముగాని ప్రాసమనఁబడును. మొదటి పాదముననే హల్లు ప్రాసమగునో, అన్ని పాదములందును నదే హల్లు ప్రాసమగును, యతివిషయమున హల్లుతోపాటు, అచ్చునకుఁ గూడ మైత్రి చెల్లవలయును. ప్రాసమున కట్టుగాక హల్లు ఒకటైన జాలును. దానిమీఁది యచ్చుతోఁ బనిలేదు.

### ప్రాస నియమములు

ప్రాసాక్షరము సంయుక్తముగాని, పూర్ణబిందు విసర్గ పూర్వక ముగాఁగాని యొక పాదమున నున్నచో, నన్ని పాదములందును నట్లే యుండవలయును.

ప్రాస పూర్వాక్షరము గురువైన అన్ని పాదములందును గురువే

యుండవలయును. లఘువైన అన్ని పాదములందును లఘువే కావల యును.

1. స్వరనియమము లేదు - అమృత, అమర, క్రమము, సము దయము.

2. సంయుక్తాక్షరము - నవ్య, ద్రవ్య, దివ్య, కావ్య.

3. పూర్ణబిందు పూర్వక ప్రాసము - చందన, మందము, నంద, పొందు.

4. విసర్గ పూర్వక ప్రాసము - దుఃకవిత, రఃకవిత, తఃకరణ, తఃకందుక.

5. గురుపూర్వక ప్రాసము - రామ, భీమ, సోమ, భామ

6. లఘుపూర్వక ప్రాసము - విమల, కమల, సుమతి, అమిత.

కాని ఒక పాదమున గురుపూర్వకముగాను, వేఱొకపాదమున లఘు పూర్వకము గాను ఉండరాదు.

7. సాధారణముగా ఏ హల్లునకు ఆ హల్లే ప్రాసము నందుండవల యును. కాని ఋ-ర, న-ణ, ల-ళ, ద-ధ, ధ-థ.

అనువానికి ప్రాసమైత్రి పూర్వకవుల ప్రయోగములలోఁ గానవచ్చు చున్నది.

ర-ఱలకుఁ ప్రాసమైత్రి కొందఱకు సమ్మతము, కొందఱకు సమ్మ తము గాదు.

## షడ్విధ ప్రాసములు

క. భాసురములగుచు నుకర

ప్రాసాను ప్రాస దుష్కర ప్రాసాంత్య

ప్రాస ద్విప్రాస త్రి

ప్రాసములన షడ్విధములు ప్రాసములుర్వీన్. 164

(భీమన ఛందము)

సుకరప్రాసము, దుష్కరప్రాసము, అంత్యప్రాసము, ద్విప్రాసము
ప్రాసము అని ప్రాసము లాఱువిధములు.

## 1. సుకరప్రాసము

క. వరమోహనకార! ధరణీ
సురవర సురభూజ! సుగుణ సుందర! తరుణీ
స్మరనిభ! సుకర ప్రాస మ
మరఁ జెప్పంగఁ గృతులఁ జెల్లు మల్లియరేచా! 165
(భీమన ఛందము)

ప్రాసము సులభాక్షర మయినచో సుకరప్రాస మనఁబడును.

పై పద్యమున 'ర' ప్రాసము. ఈ ప్రాసమైత్రి సుకరము గావున
ని సుకరప్రాసమున కుదాహరణ మగుచున్నది.

## 2. అనుప్రాసము

క. విప్రప్రకరముని ప్రీ
తిప్రద! సుప్రభవ! యప్రతిమదోః ప్రభవా!
విప్రణుతి! సుప్రసన్న! య
ను ప్రాసప్రవణ మిది మ సుప్రియ చరితా! 1
(అనంతుని ఛందము)

ఒకే యక్షరము, వెంట వెంట వచ్చునట్లు రచించుట అనుప్రాస
మనబడును. పై పద్యమున 'ప్ర' అను నక్షరము వెంట వెంటఁ బలు
మాఱులు వచ్చినది కావున నిది- అనుప్రాసము.

## 3. దుష్కర ప్రాసము

క. దోః కీలిత మణికటక! యు
రః కలిత రమాభిరామ! స్ఫురాజిత సుగుణాం
తః కరణ! ఖండితారి శి
రః కందుక! యనిన దుష్కర ప్రాసమగున్ 167

(అనంతుని ఛందము)

దుర్లభమయిన, యక్షరమును బ్రాసముగా నుంచుట దుష్కరప్రాస మనఁబడును. పయి పద్యమున విసర్గపూర్వక కవర్ణము ప్రాసస్థానమునఁ గలదు. ఈ ప్రాసమును నిర్వహించుట కష్టము. అందుచే నిది దుష్కర ప్రాసమగుచున్నది.

## 4. అంత్యప్రాసము

క. అగణిత విభవస్ఫూర్తీ!
నిగమాగమ నతత వినుత స్ఫ నిర్మలమూర్తీ!
జగదభి రక్షణవర్తీ!
యగు నంత్య ప్రాస మిట్లు స్ఫ దంచితకీర్తీ! 168

(అనంతుని ఛందము)

పాదాంతమునఁ బ్రాసమును గూర్చుట అంత్యప్రాస మనఁబడును. పయి పద్యమున స్ఫూర్తీ, మూర్తీ, వర్తీ, కీర్తీ యను రీతిని బాదాంత ములఁ బ్రాసములు గూర్పఁబడినవి. ఇది యంత్యప్రాసము.

## 5. ద్విప్రాసము

క. కంజనయన! భవభీతి వి
భంజన! శుక శౌనకాది స్ఫ బహుముని చేతో

రంజన! ద్వంద్వప్రాసమ
నంజను నిప్పాటఁ బల్కి కవి నం గృతులందున్. 169

(అనంతుని ఛందము)

ప్రతిపాదమున రెండవ, మూఁడవ యక్షరములు సమానముగాఁ గూర్చినచో, ద్విప్రాసమనఁబడును. పయిపద్యమునఁ బూర్ణబిందు పూర్వక 'ంజన' యనునక్షరములు ప్రతిపాదమునను గలవు.

## 6. త్రిప్రాసము

క. తా నవనీత ప్రియుఁడన
దానవ నిర్మూలనైక తత్పరుఁడన న
న్నానిని వినతుఁడని నతసుర
ధేనువనఁగ కృతులయందుఁ ద్రిప్రాసయగున్. 170

(అనంతుని ఛందము)

ప్రతిపాదమునను రెండవ, మూఁడవ, నాల్గవ యక్షరములు తుల్యముగాఁ గూర్చినచోఁ ద్రిప్రాస మనబడును. పయి పద్యమున 'నవని' యను నక్షరములు ప్రతిపాదమునను గలవు.

ఇట్లే చతుష్ప్రాసాదులును గలవు.

# కావ్యాది గ్రాహ్య వర్ణవిచారము

## పంచభూత బీజాక్షరములు

### 1. వాయుబీజాక్షరములు

క. వరఁగఁగ అ ఆ ఏ లును
వరుసఁ గచటతపయషలు ద్రు | వంబునఁ బదియున్
ధరఁ బవన బీజములు గో
వరవాహన! సకలలోక | వందిత చరణా! 171

(వాదాంగ చూడామణి)

అ, ఆ, ఏ, క, చ, ట, త, ప, య, ష అను పది యక్షరములును వాయు బీజాక్షరములు.

### 2. అగ్ని బీజాక్షరములు

క. క్రమమున ఇ ఈ ఐలును
రమణ ఖఛఠథఫరసలును | రాజిలుఁ బదియున్
సమముగను దహన బీజము
లమరఁగఁ దలపోయ శంబ | రాంతక హరణా! 172

(వాదాంగ చూడామణి)

ఇ, ఈ, ఐ, ఖ, ఛ, ఠ, థ, ఫ, ర, స–అను పది యక్షరములును అగ్ని బీజము లనఁబడును.

### 3. భూ బీజాక్షరములు

క. మున్నుగ ఉ ఊ ఓలును
నెన్నఁగ గజడదబలహాలు | నీ ధరఁ బదియుం

బన్నుగ భూ బీజంబులు
పన్నగ వరశయన బాణ! ౸ పన్నగభరణా. 173
(వాదాంగ చూడామణి)

ఉ, ఊ, ఓ, గ, జ, డ, ద, బ, ల, హ అను పది యక్షరములును భూ బీజములు.

## 4. ఉదక బీజాక్షరములు

క. ధీరత ఋ ౠ ఔలును
సారవు ఘఝఢధభవళలు ౸ నరసన్ బదియున్
దోరవు జలబీజంబులు
ఘోరాసుర పురవిదార! ౸ గోధ్వజ కలితా! 174
(వాదాంగ చూడామణి)

ఋ, ౠ, ఔ, ఘ, ఝ, ఢ, ధ, భ, వ, ళ, అను పది అక్షరములును జలబీజములు.

## 5. ఆకాశబీజాక్షరములు

క. ఌ ౡ అం ఙ ఞ ణ న మలు
నల్లలితములై వెలుంగు ౸ శక్షలు పదియుం
జెల్లు గగన బీజములని
తెల్లముగా వానవాది ౸ దివిజ స్తుత్యా! 175
(వాదాంగ చూడమణి)

ఌ, ౡ, అం, ఙ, ఞ, ణ, న, మ, శ, క్ష అను పదియక్షరములును ఆకాశ బీజాక్షరములు.

## పంచభూత బీజాక్షర చక్రము

## పంచభూత బీజాక్షర ఫలంబులు

మ. క్షితి బీజంబులు సంపదల లొద్వ్యాలఁ బో
షించున్ బయోబీజము
ల్సతతంబుఁ బ్రమదంబొనర్చు శిఖి బీ
జంబుల్ మృతింజేయు మా
రుత బీజంబులు శోకవార్ధిఁ బడఁగా
ద్రోయు న్నభోబీజముల్
పతి నత్యంత దరిద్రుఁ జేయు మిగులం
బద్యాది నొందించినన్. 176

(భీమన చందము)

గ్రంథాదియం దే బీజాక్షరము నుంచినఁ గృతిభర్త కెట్టి ఫలము నిచ్చునో యీ పద్యము తెలుపుచున్నది. గ్రంథారంభ పద్యము మొదట భూమి బీజాక్షరము నిడిన సంపదల నిచ్చును. ఉదక బీజాక్షరములు సంతోషమునిచ్చును. అగ్ని బీజాక్షరములు మరణముఁ దెచ్చును. వాయు బీజాక్షరములు దుఃఖము గలిగించును. ఆకాశబీజాక్షరములు దరిద్రుని జేయును. కాన బీజాక్షరమును దెలిసి కవి గ్రంథాదిని బ్రయోగింపవలెను.

## అమృతాక్షర విషాక్షరములు

క. అమృతాక్షరములు హ్రస్వము
లమరఁగ దీర్ఘములు విషము లనఁబడు వీనిన్
గ్రమమున అక టచతపయశ
సముదయమును దెలిసి నిలుపఁగఁ జనుఁ బద్యాదిన్. 177

(గోకర్ణ చ్ఛందము)

హ్రస్వాక్షరములు అమృతాక్షరము లనియు, దీర్ఘాక్షరములు విష మాక్షరములనియుఁ జెప్పఁబడును. అ, క, చ, ట, త,పాది వర్ణములలో నేవి మంచివో తెలిసికొని వాని నమృతాక్షరములుగాఁ బద్యాదిలోఁ బ్రయో గింపవలయును.

క. తెలియక ఘోషాక్షరములు
నెలవుగఁ బద్యాదియందు నిలిపినచోటన్
నలమటఁ బొందియుఁ గృతిపతి
పలుమఱు వెతనొంది దైన్యపాటుం జెందున్. 178

గ, జ,డ,ద,బ, ఘ, ఝ. ఢ. ధ, భ, ఙ, ఞ, ణ, న, మ, య, ర, ల, వ, శ, ష, స, హ-అనునవి వ్యాకరణమున ఘోషాక్షరములనఁబడును. ఈ యక్షరములను గావ్యాదిలోఁ బ్రయోగించినచోఁ గృతిపతి పెక్కు కష్ట ములకు లోనయి దారిద్ర్యము ననుభవించును.

క. అకచటతప యశ లెనిమిది
ప్రకటిత గిరి ఋతులమూఁటఁ బదునొకొండన్
వికటముగఁ బెట్టి పద్యము
సుకవులు సత్ప్రభుల కిడర శుభకరమగుటన్. 179
(ఉత్తమగండ చ్ఛందము)

అ, క, చ, ట, త, ప, య, శ అను నీ యెనిమిది యక్షరములను బద్యము మొదటి పాదమున 3, 6, 7, 11 స్థానములలోఁ బ్రయోగించినచోఁ గీడు కావున సత్కవులు గ్రంథాదిలోనీ స్థానములలోనీ యక్షరములను నిలిపి ప్రభువుల కంకితము చేయరు. ఇట్టి యక్షరములను నిలిపి చెప్పిన గ్రంథము నంకితము గొన్న ప్రభువునకు హాని కలుగునని యెఱుఁగునది.

గిరి=కొండ—ఏడు, ఋతువులు=ఆఱు

క. పుర శర రస గిరి రుద్రుల
నరయ నకచటతప లిడుట ౦ యనుచిత మీా య
క్షరములు శరచఛజంబులు
బరిహారణీయంబు లాదిఁ ౦ బంకజనాభా! 180

(అనంతుని ఛందము)

మొదటి పద్యము ప్రథమ పాదమున 3,5,6,7,11 స్థానములందు అ, క, చ, ట, త, ప అను యక్షరములును, పద్యము మొదట స, ర, చ, ఛ, ఝ, అను నక్షరములను నిలుపరాదు.

పుర=3, శర=5, రస=6, గిరి=7, రుద్రులు=11

చ. రస గిరి రుద్రసంఖ్యలను
రాదొనఁగూర్ప న్స్వరాదివర్ణముల్
వసుధ హకారమున్ క్షరట
వర్ణ చవర్ణభముల్ దలంపఁగా
అనజగరంబు లగ్న్ని తెడ
నైదవచోట హలాది వర్ణముల్
నసిదగఁజెప్ప నాఱిట ర
నల్ జగముల్ గదియింప వర్జ్యముల్ 181

అ, అ, హ, క్ష, ర, ట, చ, భ అను నక్షరములను 6, 7, 11 స్థానములలో నిలుపరాదు మఱియును అ,న,జ,గ, రలు మూఁడవచోటును శవర్ణము అయిదవచోటను, ర, స, జ, గ లు ఆఱవచోటను ప్రయోగింపరాదు. ఈ యక్షరములు కృత్యాది పద్య ప్రథమపాదమున వర్జింపదగినవి.

క. ఞలుఋులుఙఛఝఞటదధణ
దలునవబణములును తళలు ౦ దగ నక్షలుక్

నెలకొని పద్యముఖంబున
నిలువరు సత్కవులు శాస్త్రనింద్యము లగుటన్ 182
(అథర్వణుని ఛందము)

ఙ, ఞ, ఋ, ౠ, ఙ. ఛ, ఝ, ఞ, ట, ఠ, ధ, ణ, ద, న, వ, ప, ర, శ, క్ష, స అను నక్షరములను పద్యముఖమునఁ బ్రయోగింపరాదు ఇందు ద, ణ వర్ణములు పునరుక్తములు.

క. హాజగడ లిపి మూఁటవచో
నిజముగ నిందించిచెప్ప నీల్గుటయరుదే
భుజగమునకన్నుఁ గీడగు
సుజనామరభూజ! రేచ! సుగుణసమాజా! 183
(భీమన ఛందము)

హ, జ, గ, డ అను నక్షరములను పద్య ప్రథమపాదమున మూఁడవచోట నుంచి తిట్టినచోఁ బాము కఱచుటకంటెను గీడయి మరణించును.

క. ఘోరతరపద్యముఖమున
తేటుగ నొకచోటు చూచి పెదకఁగనేలా
యాఱవకడ 'తా' నిలిపిన
మాఱమ్మునఁ గ్రుమ్మినట్లు మడియు మనుజుఁడున్ 184
(భీమన ఛందము)

పద్యము మొదటినుండి యాఱవదగుచోట త కారము నిలిపి తిట్టినచో వెంటనే మరణము గలుగును.

చ. హయమదిసీత పోతవసు
ధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ
జాహ్నవి వారిధి మారుఁ డంజనా
ప్రియతనయుండు సింగన వి
భీమఁడు గుడిమెట్ట లంక నా
జయమును పోతరక్కసుని
చావును నేడవనాఁడు సూడుఁడీ 185

(భీమన చాటువు)

దీనికిఁ బూర్వకవి లక్ష్యము.

ఆఱవచోట తకారమును నిలిపి వేములవాడ భీమకవి తన గుఱ్ఱము గారించిన పోతురాజును దిట్టిన పద్యమిది, దీనిచేఁ బోతరాజేడవనాఁడు జచ్చెనందురు.

## శ్రీకార ప్రభావము

శ్రీకారము కృత్యాదిని
ప్రాకటముగనున్నఁ జాలు ♦ బహుదోషములం
బోకార్చి శుభము లొసఁగును
ప్రాకృతముగ నినుమసోఁకు ♦ పరుసము భంగిన్ 186

కావ్యాదిని శ్రీకారమునుంచి రచించినచో ఇనుము పరుసవేదిసోఁకిన ప్రమగునట్లు ఎన్నిదోషము లున్నను దొలఁగి శుభము గలుగును.

## అక్షరములకు గ్రహాధిపతులు

తే. అదులకు రవి కాదుల కవనిజుండు
చాదులకు బుధుఁడును, కవి టాదులకును
తాదులకు బృహస్పతి, శని పాదులకును
యాదులకు నెల్ల శశియు గ్రహంబు కృష్ణ! 187

అకారాద్యచ్చులకు సూర్యుఁడును, క వర్గమున కంగారకుఁడును, చ వర్గమునకు బుధుడును, ట వర్గమునకు శుక్రుఁడును, త వర్గమునకు బృహస్పతియును, ప వర్గమునకు శనియును, యకారాదులకు (అంతస్థములకు, ఊష్మములకు) చంద్రుఁడును అధిపతులయిన గ్రహములు.

## వర్గములకు జాతులు

క. వసుధామరులకు కచటలు
వసుధాపతులకును తపర వలు వైశ్యులకున్
యసహాలశషలును శూద్రుల
కనమపుళక్షటలు చెప్ప నగుఁ బద్యాదిన్ 188
(అథర్వణుని ఛందము)

బ్రాహ్మణులకు క, చ, ట వర్గములును రాజులకు తవర్గ, ప వర్గములు రేఫయు, వ కారమును, వైశ్యులకు య, స, హ, ల, శ, ష లును శూద్రులకు ళ, క్ష అ వర్ణములును పద్యము మొదటనుంచి చెప్పవలయును.

క. కాదులు వర్గత్రయమును
భూదేవతలు తపవర్గములు రవలును ధా

శ్రీ దయితులు యలశవసహ
లాదట వైశ్యులును శక్ష ళ అంబులు శూద్రుల్ 189

(అనంతుని ఛందము)

కవర్గ, చవర్గ, టవర్గములకుఁ జెందిన యక్షరములు బ్రహ్మ బీజములు. తవర్గ, పవర్గములు, ర, వలును క్షత్రియ బీజములు. య, ల, శ, ష, స, హలు వైశ్యబీజములు, ళ, క్ష, ఱ లు శూద్రబీజములు.

## మాతృకా పూజనము

సీ. కాది త్రివర్గ వ ర్ణాలికి మాణిక్య
వజ్రభూషలుఁ దెల్ల వస్త్రములును
తపవర్గ రవవర్ణ తతి కబ్జరాగంపుఁ
దొడవులు వలువలు తొవరు చాయ
యలశవసహ బీజ ములకగుఁ బుష్యరా
గాభరణములు పీ తాంబరములు
శక్షఱంబులకు నీ లాల సొమ్ములు గారు
కొను నీలి వన్నెల కోకలెల్ల

తే. వరుస నీనాల్గు తెలుఁగుల వర్ణములకు
ననుభవంబగు ద్రవ్యంబు లానవాలు
నాజ్యమును గమ్మఁదేనియ యానవంబు
వీనిఁ దెలియక నత్కవి యానజగతి

(కవిసర్పగారుడము)

అక్షరములకు మాతృక లనిపేరు. కృతిపతి యే కులమువాఁడో యా కులమునకుఁ జెందిన యక్షరమును మొదటనుంచి పద్యమును మొదలు పెట్టవలయును. ఆ యక్షరమును బ్రయోగించు నవసరమున

మాతృకార్చన చేయవలయునని ప్రాచీన సంప్రదాయము. ఈ పద్యమున నా యా జాతుల యక్షరములకు భూషణములు, వస్త్రములు, నైవేద్య వస్తువులు దెలుపఁ బడుచున్నవి. వీనిని సమర్పించి మాతృకార్చన చేయవలయును. బ్రాహ్మణుల కుపయోగింపఁదగిన కాది త్రివర్గమునకు ముత్యములు వజ్రములు పొదిగిన సొమ్ములు, తెల్లని వస్త్రములు, ఇగురఁగాచిన పాలు నైవేద్యమగును. ఇట్లే క్షత్రియులకుఁ జెందిన తవర్గ, పవర్గ ర వ లకు కెంపులు చెక్కిన సొమ్ములు, రక్త వస్త్రములు, నేయి నైవేద్య వస్తువు, వైశ్యజాతి బీజాక్షరములగు య ల శ ష స హలకు పుష్యరాగముల సొమ్ములు, పచ్చని వస్త్రములు, తేనె నైవేద్య ద్రవ్యము, శూద్రజాతి బీజాక్షరములగు ళ, క్ష, ఱ లకు నీలాల సొమ్ములు, నీల వస్త్రములు, మద్యము నైవేద్యము అని తెలియ వలయును.

ఇందు అచ్చులను గూర్చి చెప్పఁబడలేదు. అచ్చులు గూడా బ్రాహ్మణ బీజాక్షరములని యెఱుఁగునది.

## సంయుక్తాక్షర ప్రయోగవిధి

తే. మొదల సంయుక్త వర్ణంబు గదిసె నేని
మడవ కా రెంటికిని గ్రహ మైత్రి వలయు
నిది విచారింపఁడేనిఁ గృతీశ్వరుండు
పిడుగు మొత్తిన గతిఁ గూలు బిట్ట బిఱ్ఱ 191

(భీమన ఛందము)

కృత్యాది పద్యము మొదట శ్రీకారమున్నను, దేవతావాచకమయిన శబ్దమున్నను సంపదలు గలుగును. శ్రీ కారము సంయుక్త మయినను శుభప్రదమయినది. దేవతా వాచక మాదిలో నున్నచో శుభము గలుగును. ఈ యక్షరముల మంచి చెడ్డలు గ్రంథారంభ పద్య ప్రథమ పాదములో మొదటి మూఁడు గణముల యక్షరములకు జూచినఁ జాలును. తక్కిన పద్యములకుఁ జూడ నక్కఱలేదు.

# గణప్రయోగ విచారము

## గణోత్పత్తి క్రమము

ఆ. చంద్రసూర్యవహ్ని చక్షుడౌ రుద్రుని
మూఁడు కన్నులందు మూఁడు గురువు
లుదయమయ్యె దాన నొప్పారె మగణమై
యందు సప్తగణము లమరఁ బుట్టె. 192

(భీమన ఛందము)

పరమేశ్వరునకుఁ జంద్రుఁడు, సూర్యుడు, అగ్ని యను మూఁడు కన్నులు గలవు. ఆ మూఁడు కన్నుల నుండియు మూఁడు గురువులు పుట్టెను. దానికి మగణ మనిపేరు. ఆ మగణము నుండి యేడు గణములు గలిగెను.

క. ఒనరఁగ మయరసతజభన
లన నీ యెనిమిది గణముల నతి సత్కృపతో
నెనసిన మతిఁ బింగళునకు
మనసిజమథనుండు దాఁ గ్రమంబునఁ దెల్పెన్ 193

(కవి గజాంకుశము)

క. మగణము వలనన్ యగణము
యగణము వలనన్ జనించె నా రగణంబున్
రగణము వలనన్ నగణము
నగణంబును తగణమునకు జనకంబయ్యెన్. 194

(కావ్యచింతామణి)

క. తా వలన జగణమయ్యెన్
జా వలనను భగణమయ్యె ని నరసంబుగ నా
భా వలన నగణమయ్యెను
భావింపఁగ జన్యజనక ని భావముగాఁగన్. 195
(కావ్యచింతామణి)

క. అదికానఁ దంౘ్రికొడుకుల
కొదవదు వైరంబటంచు ని నొనరఁగ సుకవుల్
గొదుకక బంధుగణంబులఁ
గదియుంతురు రసలుదక్కఁ ని గావ్యముఖములన్ 196
(కావ్యచింతామణి)

పరమేశ్వరుఁడు పింగళునకు 'మ,య,ర,స,త,జ,భ,న'లను నీ యెని మిది గణముల నుపదేశించెను.

మూఁడు గురువులచే నేర్పడు మగణము వలన య గణము గలిగెను. యగణము వలన రగణము, రగణము వలన సగణము, సగణము వలన తగణము, తగణము వలన జగణము, జగణము వలన భగణము, భగణము వలన నగణము గలిగెను. ఏగణము నుండి ఇంకొక గణము పుట్టెనో యా రెండింటికి జన్యజనక భావముచేఁ బరస్పర మైత్రి గలదని తెలియవలెను. రగణ నగణములకు మాత్రము విరోధము గలదని తెలియవలయును.

# అష్టగణ లక్షణములు

## 1. మగణము

మ. ధరదైవంబు గ్రహంబు సౌమ్యుఁడు హరి
ద్వర్ణంబు సత్కాంతి యా
సుర మూహింప గణంబు జాతి తిలకిం
చున్ శూద్రియా యోని చా
హారిణం బుజ్జ్వల తార జ్యేష్ఠ రస ము
ద్య ద్రౌద్ర మారాశి తే
లురు భద్రంబు ఫలంబునా మగణ మిం
పొందున్ బుధ స్తుత్యమై. 197

(కవిసర్పగారుడము)

మగణమునకు భూమి దైవము, బుధుఁడు గ్రహము, కాంతి పచ్చన, రాక్షసగణము, శూద్రజాతి, యోనిహరిణము, జ్యేష్ఠానక్షత్రము, రౌద్రరసము, వృశ్చికరాశి, శుభ ఫలము.

## 2. యగణము

మ. అలరన్ దైవము వారి బ్రాహ్మ్యము కులం
బా వన్నె తెల్పర్థ మా
ఫలమా యోని ప్లవంగ మా గణము సె
ప్పన్ మానవం బా గ్రహం
బల శుక్రుండు రసంబు దాఁ గరుణ
పూర్వాషాఢ నక్షత్ర మి

మ్ముల గోదండము రాశి యా యగణ మొ
ప్పు న్గోవిద స్తుత్యమై. 198

(కవిసర్పగారుడము)

యగణమునకు జలము దైవము, బ్రాహ్మణ కులము, తెల్లని వన్నె, ఫలము ధనము, వానర యోని, మనుష్య గణము, గ్రహము శుక్రుఁడు, కరుణ రసము, నక్షత్రము పూర్వాషాఢ, రాశి ధనుస్సు.

## 3. రగణము

మ. అనలుం డీశుఁడు రాశి మేషము గ్రహం
బా భౌముఁ డత్తార నం
బ్రణతిన్ గృత్తిక దైత్యమాగణము పై
రాజ్యంబు వశంబు మేఁ
క నెఱి న్యోని ఫలంబు భీ రసము శృం
గారంబు నతాకాంతి కో
కనదా చ్ఛచ్ఛవి మించు నా రగణ మె
కాలంబు నొప్పున్ భువిన్. 199

(కవిసర్పగారుడము)

రగణమునకు అగ్ని అధిదైవము, మేషరాశి, గ్రహమంగారకుఁడు, నక్షత్రము కృత్తిక, క్షత్రియ గణము, యోని మేఁక, ఫలము భయము, శృంగార రసము, ఎఱ్ఱకలువకాంతి.

## 4. వగణము

చ. అనిలుఁ డధీశుఁడున్ గువల
యంబుల కాంతి కులంబు హీనమున్

జను గ్రహమా శనైశ్చరుఁడు
చాలఁగ నల్పగు నన్నె తౌలి యాఁ
దనరంగ రాశి స్వాతి యగుఁ
దార ఫలంబు క్షయంబు దానవం
బౌనర గణంబు నమ్మహిష
యోని యగున్ సగణాన కీశ్వరా! 200

(వాదాంగ చూడామణి)

సగణమునకు వాయు వధిపతి, నల్లకలువల కాంతి, చండాల జాతి, గ్రహము శని, తులారాశి, స్వాతి నక్షత్రము, ఫలము నాశము, రాక్షస గణము, మహిషయోని.

### 5. తగణము

మ. అమరు న్మిన్నధిదైవముం గులము బ్రా
హ్మ్యం బా గణ బెన్నదై
వము జీవుండు గ్రహంబు నల్పురుచి నైశ్వ
ర్యంబు లబ్ధంబు మే
షము దాయోని రసంబు శాంత మల న
క్షత్రంబు పుష్యంబు రా
శి మహిం గర్కటకంబు నా తగణ ము
త్సేకంబగున్ జెల్వమై. 201

(కవిసర్పగారుడము)

తగణమునకు ఆకాశమధి దైవము, బ్రాహ్మణ కులము, దేవగణము గ్రహము బృహస్పతి, నల్లని కాంతి, ఫలము ఐశ్వర్యము, మేషయోని, శాంత రసము, పుష్య నక్షత్రము, కర్కాటరాశి.

## 6. జగణము

మ. అరుణుం డేలిక చాయ ర క్తిమ రసం
బవ్వీర మా యన్వయం
బురు వై రాజ్యము రాశి సింహము గ్రహం
బుష్ణాంశుఁ డత్తార యు
త్తర రోగంబు ఫలంబు యోని యిర వొం
దన్ ధేను వన్మానవం
బరుదారంగ గణంబు నా జగణ మిం
పారున్ జగత్సేవ్యమై. 202

(కవిసర్పగారుడము)

జగణమునకు సూర్యుఁ డధిపతి. ఎఱ్ఱని కాంతి, వీర రసము, క్షత్రియ కులము, సింహరాశి, గ్రహము సూర్యుఁడు, ఉత్తరా నక్షత్రము, రోగము ఫలము, గోవు యోని, మనుష్యగణము.

## 7. భగణము

ఉ. చంద్రుఁడ ధీశ్వరుం డమృత
సారము కాంతియు విట్కులంబు నా
చంద్రుఁడె తద్గ్రహం బతని
చాయయుఁ దెల్పు వృషంబు రాశి భో
గేంద్రము యోని దేవగణ
మీప్సిత సౌఖ్యము తత్ఫలం బిలన్
జంద్రుని తారయై తనరు
జంద్రధరా! భగణాన కెనఁగన్. 203

(వాదాంగ చూడామణి)

భగణమునకు చంద్రుఁడధిపతి, తెల్లని కాంతి, వైశ్యకులము, గ్రహము చంద్రుఁడు, వృషభరాశి, సర్పయోని, దేవగణము, ఫలము సౌఖ్యము, మృగశిరా నక్షత్రము.

## 8. నగణము

మ. వరమాతృస్థం డధినాయకుండు జయ సౌ
భాగ్యైక సామ్రాజ్య పూ
జ్యరమానంతతులీవి లబ్ధము నిజో
పాంతస్థ దుష్టాక్షరో
త్కరదోషాద్యగణౌఘ ధూర్త గుణముల్
ఖండించుటల్ శీల మె
వ్వరికిం గాదనరాదు నా నగణ మ
వ్యాజస్థితిన్ బొల్పగున్. 204

(కవిసర్పగారుడము)

నగణమునకు మహావిష్ణు వధిదైవము. జయము, సౌభాగ్యము సామ్రాజ్యము, సంపద మున్నగునవి దీని ఫలము. దీని సమీపమున దుష్ట వర్ణము గాని, దుష్టగణము గాని యున్నను గీడు గలుగదు. నగణ ప్రభావమున దాని దోషము పశమించును. కాని నీ నగణమునకు గ్రహ గణ నక్షత్రాదులఁ జెప్పనక్కఱ లేదని భావము.

## గణాధిదైవములు

చ. భగణము నేలుఁ జందురుఁడు
భానుఁడు దా జగణంబు నేలు నా
నగణము నేలు నిర్జర గ
ణంబు సమీరణుఁ డేలు నెప్పుడు

స్సగణము సుర్వియేలు మగ
ణంబు నొగిన్ యగణంబుఁ దోయము
న్రగణము పావకుండు తగ
ణంబు నభంబును నేలుఁ గేశవా! 205

(అనంతుని ఛందము)

భగణమునకుఁ జంద్రుఁడు, జగణమునకు సూర్యుఁడు, నగణమునకు దేవతాగణము, సగణమునకు వాయుదేవుఁడును, మగణమునకు భూమియు, యగణమునకు జలమును, రగణమునకు అగ్నియు తగణమునకు ఆకాశమును అధిపతులు.

గణఫలములు

ఉ. సవ్యసుఖ ప్రదాయి భగ
ణంబు జకారము రుక్ప్రదంబగున్
ద్రవ్యము నేయు నా లయక
రంబు నకారము మా శుభంబు యా
దివ్యసువర్ణకారి వెతఁ దెచ్చును
రేఫ విభూతినిచ్చుఁ దాఁ
గావ్యములందు నాదినిడఁ
గర్తకు భర్తకూ సంబుజోదరా! 2(

గ్రంథాది యందు శుభగణమును ప్రయోగించినచో, కృతికర్తకును కృతిభర్తకును శుభము గలుగును. అశుభ గణమును ప్రయోగించిన హాని కలుగును. ఏ గణము లేఫలము నిచ్చునో యీ పద్యమునఁ జెప్పఁ బడినది.

భగణము సుఖమును, జగణము రోగమును, నగణము ధనమును, సగణము నాశమును, మగణము శుభమును, యగణము స్వర్ణ సంపదను, రగణము దుఃఖమును, తగణము ఐశ్వర్యమును నిచ్చును. శుభ ప్రదము లయిన గణముల నెఱిఁగి ప్రయోగింపవలయును.

క. నరసాన్న రుచిరభూషణ
పరితాపస్థానచలన బహుదుఃఖ రుజా
పరిపూర్ణాయు రచలలక్ష్మీ
కరములు మయరసతజభన గణములు వరుసన్. 207

(భీమన ఛందము)

ఈ పద్యము నందును గణముల శుభా శుభ ఫలములు చెప్పఁబడి నవి. మగణము షడ్రసోపేతాన్న లాభమును, యగణము సౌమ్యమును, రగణము దుఃఖమును, సగణము స్థాన చలనమును, తగణము బహు దుఃఖమును, జగణము రోగమును, భగణము పూర్ణాయువును, నగణము తఱుగని సంపదను నిచ్చును.

గణములకు జాములు

సీ. జయవిజయంబులు శంఖమహా
శంఖములనఁ బగటిజా ల్వెలయుచుండు
రాత్రిజాత్రాము వి రామస్తుత్రప్రసు
త్రంబులు ననఁగను దనరుచుండు
నీ యెనిమిదిజాలఁ బాయక మగణాది
గా జనించు గణాష్ట కంబు వరున
నేజామునను గావ్యఁ డెలమితోఁ గబ్బంబు
విరచింపఁబూనె న వ్వేళయందు

తే. నుద్భవంబయిన గణప్రవ । యోగమునకు
శుద్ధిగాఁ గూర్చునదియు; వి । జ్ఞుఁడు పడఁగ
గణము లూహించి కూర్చ బి । శారికకవి
పద్యమొల్లఁడు బ్రతుకాన । పడఁడువాఁడు. 208

(కవిసర్పగారుడము)

జా మనఁగా మూఁడు గంటల కాలము. పగలు నాలుగు జాములు, రాత్రి నాలుగు జాములు. పగటి జామునకు వరుసగా జయము, విజయము, శంఖము, మహాశంఖము అనియు, రాత్రి జామునకు రామము, విరామము, సుప్తము, ప్రసుప్త మనియుఁ బేర్లు. మ, య, ర, స, త, జ, భ, న గణము లెనిమిది క్రమముగా జయాదు లగు నెనిమిది జాములలో నుంచి కవిత్వారంభము చేయవలయును. జామునకుఁ దగని గణమును గూర్చి కవిత చెప్పరాదు.

## గణములకు జాతులు

క. లలితయతలు విప్రకులం
బులు రజలవనీశకులజ । ములు భనలు న్వి
ట్కులజులు మగణము నాలవ
కులజము సగణంబు హీన । కులజం బమరన్. 209

యగణ, తగణములు బ్రాహ్మణ కులమునను, రగణ జగణములు క్షత్రియ కులమునను, భగణ నగణములు వైశ్య కులమునను, మగణము శూద్ర కులమునను, సగణము చండాల కులమునను బుట్టినవి.

క. నాయకుఁ డే కులమైనను
బాయక తత్కులగణంబు । పద్యము మొదటన్

ధీయుక్తి నిడఁగ మేలగు
నేయెడ సంకరము లిడఁగ నెగ్గగుఁ బతికిన్. 210

(అధర్వముని ఛందము)

కృతిభర్తయే కులమువాడో యా కులమునకుఁ జెందిన గణమునే కృత్యారంభ పద్యాదిలోఁ బ్రయోగించిన శుభప్రదమగును. అట్లుగాక కృతిభర్తృ కులమునకుఁ జెందని గణము ప్రయోగించుట శుభప్రదముగాదు.

## గణ లింగములు

క. మగణము వగణము పురుషులు
జగణరగణనగణములు నిజంబుగ నింతుల్
యగణయు తగణము భగణ
మ్మగు క్లీబము లెనఁగు నుత్తమాదిఫలంబుల్. 211

(భీమన ఛందము)

గణములకు లింగ నిర్ణయము చేయఁబడుచున్నది. మగణము, వగణము పుంలింగములు. జగణము, రగణము, నగణము స్త్రీలింగములు, యగణము, తగణము, భగణము నపుంసక లింగములు, పుం స్త్రీ నపుంసక లింగ గణములకు వరుసగా నుత్తమ మధ్య మాధమ ఫలములు గలుగును.

క. సంగతిగఁ గృతుల స్త్రీ పుం
లింగపుశబ్దములు నిల్పనెన్నగుఁ బతికిన్
వెంగలిబుద్ధి నపుంసక
లింగంబగు శబ్దమిడిన లేవు సుఖంబుల్. 212

(కవిసర్పగారుడము)

గ్రంథాదిని పుంలింగ స్త్రీ లింగ గణములను గూర్చి రచించినచోఁ

గృతి భర్తకు శుభము గలుగును. నపుంసక లింగ గణమును గూర్చినచో మేలు గలుగదు.

## గణయోనులు

క. హరిణ, వలీముఖ, మహిషీ,
వర సైరిభ, మేష ధేను, ఫణి వాతాశనులున్,
వరుసను మయరసతజభల
కరయఁగ నక్షత్రయోను లై విలసిల్లున్. 213

(వాదాంగ చూడామణి)

గణములకు యోనులను జెప్పుచున్నాఁడు. మగణమునకు—జింక, యగణమునకు—కోఁతి, రగణమునకు - బఱ్ఱె, సగణమునకు - దున్న, తగణమునకు - మేఁక, జగణమునకు - గోవు, భగణమునకు - సర్పము, యోనులు. నగణమున కిందు యోని చెప్పఁబడలేదు. అప్పకవీయమున నగణమునకు యోవి గణమని చెప్పబడినది.

## గణముల ఛాయలు

క. రవితురగ, రజత, విద్రుమ,
కువలయ, హరి నీల శకల, కురువింద, సుధా
ర్ణవ, కనకనికష రేఖా
ప్రవిమల కాంతులఁ దనర్చుఁ బరువడి గణముల్.214

ఈ పద్యమున గణముల వన్నెలు చెప్పఁబడినవి. మగణమునకు—ఆకుపచ్చన, యగణమునకు—వెండి వన్నె (తెలుపు), రగణమునకు—పగడపుఁ జాయ, సగణమునకు - కలువవన్నె, తగణమునకు - నీలకాంతి, జగణమునకు - కెంపు వన్నె, భగణమునకు పాల సంద్రపుఁ జాయ, నగణమునకు - బంగారు చాయ.

# గణసంయోగములు

## మగణ సంయోగము

క. మగణంబు పద్య ముఖమున
నగణితముగఁ గూర్చి చెప్ప నగుఁ గృతియొండెన్
దగఁ బద్యమొండెఁ గర్తకు
నగణితముగ నొసఁగు నాయు రైశ్వర్యంబుల్. 215

(భీమన ఛందము)

పద్యారంభమున మగణము నుంచి రచించుట మంచిది. కృతినిగాని, కథకాక పద్యమును గాని మగణముతో మొదలుపెట్టి వ్రాసినచోఁ గృతి కర్తకు నాయురైశ్వర్యములు గలుగును.

క. జగతిని గణముల కెల్లను
మగణము గారణము గాన మగణము గదియన్
నిగిడించిన గణ మెల్లను
దగ శుభ మొనరించుఁ గీడుదగులదు దానన్. 216

(కావ్యచింతామణి)

గణముల కన్నింటికిని మగణమే మూలము. (ఉత్పత్తి కారణము) 'వున మగణము తరువాత దుష్టగణమున్నను మేలు గలుగును.

క. మించిన పరుసము లోహముఁ
గాంచనముగఁ జేయునట్టి కైవడి గణముల్

మంచివి గానివి నైనను
మంచివిగా వెలయఁజేయు ౯ మగణము పతికిన్ 217

పరుసవేది ఇనుమును బంగారము చేయునట్లు మొదట మగణమున్నచో నది తరువాత దుష్టగణములున్నను గృతిపతికి శుభ ఫలములనే యిచ్చును.

క. మగణముతోఁ బద్యాదిని
మగణము గదిసినను ధరణి ౯ మండల మెల్లన్
బోగడొందఁ నేలుఁ గృతిపతి
నగణము గదిసినను గీర్తి ౯ జగముల వెలయున్. 218

పద్యాదిని మగణముతో మగణమును గూర్చి రచించినచోఁ గృతిపతి భూమండల మెల్ల నేలు నంతటివాఁడగును. మగణముతో నగణమును గూర్చినచోఁ గృతిభర్త కీర్తి లోకమంతయు వ్యాపించును.

క. మించులు గిరికొనుముత్యము
గాంచనముం గదిసినట్లి ౯ గతి నల యగణం
బంచితముగఁ దనుఁగదిసిన
మంచిదిగా లక్ష్మినొసఁగు ౯ మగణము పతికిన్. 219

కావ్యారంభ పద్యమును మొదట మగణమును దరువాత యగణమునుంచి వ్రాసినచో మంచి ముత్యము బంగారముతోఁ గూడి మిక్కిలి ప్రకాశించునట్లు కృతి భర్తకు శుభముల నొసఁగును.

క. ముందట నిల్పిన మగణము
క్రిందన్ జగణంబుగదియఁ గీలించిన మే

లొండున్ నగణం బటువలెఁ
బొందించిన విభుఁడు రిపులఁ ౯ బోర జయించున్ 220

పద్యాదిని మగణముపై జగణమును నిలిపినచోఁ గృతిభర్తకు శుభము గలుగును. మగణము మీదఁ సగణము నిలిపినచో శత్రువులను జయించును.

క. మగణా లెప్పుడు శుభకర
మగు నైననుఁ గ్రూరగణము ౯ వది వ్రాసినచోఁ
దెగి చంపు బుధుఁడు క్రూరుం
డగు గ్రహముం గదిసి క్రూరుఁ ౯డై చనుమాడ్కిన్ 221
(భీమన చందము)

మగణ మెప్పుడును శుభకరమే. కాని దాని తరువాత దుష్టగణ మున్నచో, సౌమ్యమైన బుధగ్రహము పాపగ్రహములతోఁ జేరి పాపి యగునట్లు అశుభఫలములను గూర్చును.

[మగణము తన వెంటనున్న దుష్టగణమును మంచిదిగాఁ జేయు నన్నది యొక మతము. ఇది మతాంతరము].

## యగణ సంయోగము

క. శంకింపక యగణముతోఁ
బంక జహితగణము గదియఁ ౯ బద్యము జెప్పన్
బొంకము సెడి విభుఁ డొరులకు
గింకరుఁడై దిక్కు లేక ౯ గీడ్పడి యుండున్. 222

యగణముతో జగణమును జేర్చి పద్యాదిని బ్రయోగించినచోఁ గృతిపతి దిక్కుమాలి యితరులకు దాసుఁడగును.

పంకజ హితగణము=సూర్యగణము - సూర్యుఁడు దైవముగాఁగల గణముల జగణమని యర్థము.

## రగణ సంయోగము

క. పొగడ్తాందఁ బద్య ముఖమున
రగణము యగణంబుఁ గూడి రాజిల్లినచో
జగ మంతయు నేలెడి వాఁ
డగుఁ గృతిపతివిభవయుక్తుఁడగుఁ గవివరుఁడున్ 223
(భీమన ఛందము)

కావ్యారంభపద్యమున రగణము వెంట యగణమును గూర్చి రచించినచోఁ గృతిపతికి సామ్రాజ్యమును, గృతికర్తకు సంపదయు లభించును.

క. ఇంగల రగణము జగణము
సంగడమున నొండెఁ దగణ సంగతి నొండెన్
మంగళకరమని పద్యము
మొంగల జెప్పుదురు సుకవిముఖ్యులు గృతులన్. 224

రగణ జగణములనుగాని, రగణ తగణములనుగాని వరుసగాఁ గూర్చి రచించినచో మంగళకరమని సుకవీంద్రులట్లు చేయుదురు.

క. అనలానిల సంయోగం
బనుపమ కీలా కరాళ మగు వహ్నిభయం
బొనరించుఁ గర్తృగృహమున
ననుమానము లేదు దీన నంద్రు కవీంద్రుల్. 225
(అధర్వణ ఛ్ఛందము)

కృత్యాదిని రగణ సగణ సంయోగము చేయరాదు. అట్లుచేసినచోఁ కృతి కర్త గృహమున కగ్నిభయము

క. రగణంబును నగణంబును
జగణముఁ బద్యాది నిల్పఁ ◊ జనదెవ్వరికిన్
దగదనక యునియె నిల్పిన
మిగులం బతి కవయుఁ జెడుగు ◊ మేదిని లోనన్. 226

రగణ, నగణ, జగణముల నొకదాని వెంట నొకటి పద్యాదిలో నిలుపరాదు. అట్లు నిలిపినచోఁ గృతిపతికి హాని కలుగును.

(రగణ నగణ తగణములలో దేనిని గృత్యారంభమున నిలుప రాదను నర్థాంతరమును గూడఁ జెప్పవచ్చును.

నగణ సంయోగము

క. మునుకొని పద్య ముఖంబున
ననిలగణం బిడిన నాయు ◊ రారోగ్యములున్
గొనసాగు, దానిముందట
ననలగణం బిడినఁ బతికి ◊ నలజడి సేయున్. 227

(భీమన ఛందము)

కావ్యారంభ పద్యము మొదట నగణమును నిలిపినచోఁ గృతి భర్తకు ఆయురారోగ్యములు గలుగును. కాని దాని వెంబడి రగణము నిలిపినచో నుపద్రవము సేయును.

క. మారుతగణంబు నంప
త్కారణమగు జతగణములఁ ◊ గదిసినచో నా
మారుత గణంబు జతగా
నా రవిగణమున్నఁ బతికి నలమట వచ్చున్. 228

నగణముతో, జగణ, తగణములు గలిసినచో సంపదగలుగును. నగణము వెంబడి జగణమున్నచో హాని గలుగును.

ఈ పద్యమునఁబూర్వో త్తరార్థములకుఁ బరస్పరవై రుద్ధ్యముగలదు. పూర్వార్థమున సగణముతో జగణ, తగణములు సంపత్కరము కలదు. ఉత్తరార్థమున స-జ గణ యోగము హానికరమని కలదు. ఏదేని పాఠాంతరముండునేమో. జ, త గణములనుచోట భ-మ గణములని సవరింప వచ్చును.

క. మారుతగణంబు జత సం
గారపుగణమున్నఁ బతి మృ తి గంబుల చేతన్
జోరులచే శత్రులచే
ధారుణిఁ జెడు మందిరంబు దరికొని కాలున్ 229

వాయుదేవతాకమయిన స గణమును, అగ్నిదేవతాకమయిన ర గణమును ఒక దానివెంట ఒకటి నిలిపి పద్యమును జెప్పినచోఁ గృతికర్త క్రూరముగ చోర శత్రు బాధల నందును అతని ఇల్లు దగ్ధమగును.

## తగణ సంయోగము

క. తగణంబున కధిదైవము
గగనం బది శూన్యము గుచుఁ గాదని పలుకన్
దగ, దది మిక్కిలి మాంచిది
గగనం బొగి నిత్య విభవుఁ గాఁ జేయు నిలన్ 230
(కావ్యచింతామణి)

తగణమున కధిదేవత యగు నాకాశము శూన్యము గాన ఫలము శూన్యమని పలుకఁదగదు. తగణము శాశ్వత విభవునిగాఁజేయును.

ఆ. ఆది తగణ మొప్పు నది దేవతా గణం
బరసి చూడ దాని కమరగురుఁడు

గ్రహము గాఁ బద్య । గద్య ముఖంబుల
మంచిదనుచు భీము । డెంచినాఁడు 231

తగణము దేవగణమునకుఁ జెందినది. దానికి బృహస్పతి గ్రహము. కావునఁ గృతి ముఖమున తగణప్రయోగము శుభప్రదమని భీమన మతము.

క. అగణిత పద సంపత్కర
మగుఁ దగణము దానిపజ్జ । నమరిన గణముల్
పెగటుగుణంబులు మానుఁ జె
లంగుచుఁ సౌఖ్యంబు లొసఁగు । లలిత చరిత్రా 232

తగణము సంపత్కరము. దానిప్రక్క దుష్టగణమున్నను శుభప్రద మగును.

క. తగణంబు దొలఁతఁ బిమ్మట
భగణంబును గదియనిల్పి । పద్యము హృద్యం
బుగ రచించిన కర్తకు
నగణితముగ నొసఁగు నాయు । రారోగ్యైశ్వర్యంబుల్ 233
(భీమన ఛందము)

కావ్యారంభ పద్యము మొదటి తగణమును దాని తరువాత భగణమును నిలిపి రచించినఁ గృతికర్తకు ఆయురారోగ్యైశ్వరములు గలుగును.

క. మొగివాత తగణముండిన
పగవశ యగణంబు దాని । వద్దన నిలుపన్
దెగి తన్నుఁ జంపఁ దలఁచిన
పగవారికినైనఁ దగదు । పద్యముఁ జెప్పన్. 234

కృతి ముఖమున తగణము వెంబడి యగణమును నిలిపి తన్నుఁ జంప నెంచిన పగవాని మీఁదనైనను బద్యముఁ జెప్పరాదు.

క. ఆరోగ్యకరుఁడు భాస్కరుఁ
డారయ జగణమున కొడయుఁ డది మొగి నిడఁగా
నేరోగము పైకొన దా
చేరువ చుట్టంపుగణముఁ జేకొనఁ జాలున్ 235

సూర్యుఁడారోగ్యప్రదుడు. సూర్యుఁడధిపతిగాఁ గల జగణము కావ్యారంభపద్యములోఁ జెప్పినచో రోగహరమగును. ఆ జగణము వెంబడి శుభగణము నుంచిన మఱింత శుభము గలుగును.

## జగణ సంయోగము

క. అవివేకులు జగణంబును
భువి రోగము సేయుననుచుఁ బోనాడుదు రీ
కవివరులున్ శబ్దార్థము
వివరింపరు రుక్కు దీప్తి విదితముగాఁగన్. 236

(కావ్యచింతామణి)

జగణము రుక్ప్రద మని కొంద అవివేకులు తలంతురు. రుక్ప్రద మనఁగా రోగప్రదమని వారి యభిప్రాయము. కాని యది సరిగాదు. 'రుక్కు' అనఁగా నిట రోగమర్థముగాదు. దీప్తి=కాంతియని యర్థము. కావున జగణము దీప్తికరమని—మేలుసేయునని తెలియవలయును.

క. తగణంబుఁ గదిసి చంపును
రగణముతోఁ గదిసి ఘోర రణ మొనరించున్

భగణ మిఁక నొక విచిత్రము
మగణముతోఁ గూడఁ గాల § మానము పతికిన్ 237

జగణముతో తగణము చేరినచోఁ గృతిపతి మరణించును. రగణము చేరినచోఁ బ్రభువునకు యుద్ధము సంభవించును. ముందు గణమును జెప్పి తరువాత మగణమును జెప్పినచోఁ గృతికర్త మరణించును. ఈ పద్యమున 'జగణముతోఁ'ననునది యూహ్యము. ఇది జగణ సంయోగమును గూర్చి చెప్పనదేకదా!

క. రాజులకు జగణరగణము
లోజం గీలించి సుకవి § యొనఁగిన పద్యం
బాజిని జయమిూఁ జాలును
దేజీ లేనుఁగులు భటులుఁ § దేరులు నేలా! 238

జగణ రగణ సంయోగ మొనర్చి రాజుపైఁ బద్యము చెప్పినచో ఆ రాజునకుఁ జతురంగ బలముతోఁ బనిలేకయే జయము సిద్ధించును.

భగణసంయోగము

క. భగణంబు సకల శుభములఁ
బొకడొందఁగఁ జేయు దానిఁ § బొందిన గణముల్
మిగుల శుభంబుల నొసఁగును
యగణంబు సువర్ణకారి § యగుఁ బద్యాదిన్ 239

కృత్యాదిని భగణ మున్నచో సకల శుభములు కలుగును. దాని వెంబడి నెట్టిగణమున్నను శుభములే కలుగును. పద్యాదిని యగణము సంపత్కారము.

## నగణ సంయోగము

గీ. పర్వతములందు మేరువు భాతియగుచు
సర్వసురులందు శంకరు సామ్యమగుచు
నరయ మృగములయందు సింహంబుకరణి
గణములందెల్ల నగణంబు గరిమఁ గాంచు 240

(అధర్వణచ్ఛందము)

పర్వతములలో మేరువువలెను, దేవతలలో నీశ్వరునివలెను, మృగములలో సింహమువలెను గణములలో నెల్ల నగణము శ్రేష్ఠమయినది.

క. ఏగణము గదియు నగణం
బాగణము సమస్త మంగళావాప్తంబై
రాగిల్లు నినుము పరుసపు
యోగంబునఁ బసిఁడివన్నె నూనిన భంగిన్ 241

(భీమన ఛందము)

నగణముతో నేగణము కూడినను బరుసవేదితోఁగూడిన యినుము బంగారమగునట్లు సమస్త మంగళప్రదమగును.

## గణసంయోగ ప్రభావము

క. చందనతరు సంగతి పిచు
మందంబులు పరిమళించు మాడ్కి నమందా
నందకరమైన గణముల
పొందున దుష్టగుణవర్ణములు ప్రియమిచ్చున్ 242

(ఉత్తమగండచ్ఛందము)

పద్యాది గణము శుభప్రదమయినచో దాని తరువాతనున్న గణము

దుష్టమయినదయినను, జందనవృక్షము దగ్గఱనున్న వేఁపచెట్టు పరిమ
ళించునట్లు, శుభఫలప్రదమే యగును.

గీ. పరుస వేదిసోఁకఁ $ బెరసినలోహంబు
జాతరూపమైన $ చందమునను
సారమైన గణము $ సంగతిఁ దనకీడు
మాని దుష్టగణము $ మంచిదగును 243

పరుసవేదిని దాఁకిన యినుము బంగారమగునట్లు మంచిగణము
సంగతినున్న దుష్టగణముగూఁడ శుభఫలము నిచ్చును.

## గణసంయోగ విశేషములు

క. రసలం జెప్పినఁ జిచ్చగు
జసలం జెప్పినను దెవులు $ చయ్యనవచ్చున్
తసలం జెప్పిన మేలగు
మసలం జెప్పినను కర్త $ మండలమేలున్ 244

(భీమనచందము)

పద్యాదిని రగణ సగణ యోగము, జగణ సగణయోగము మంచిది
కాదు. హానిగలుగును. తగణ సగణ సంయోగము శుభప్రదము. మగణ
సగణ యోగమువలనఁ గృతికర్త ప్రభువగును. మగణ సగణసంయోగము
గల శార్దూలవృత్తము కృత్యాదిలో నుంచి రచించినచో గృతిపతి మండ
లాధిపతి యగును.

క. నయలం జెప్పిన శుభమగు
జయలన్ జెప్పినను పతికిఁ $ జయకీర్తులగున్

రయలన్ జెప్పిన నెంతయుఁ
ప్రియమగు మత్రిమయలఁ జెప్పఁ జెంపొనరించున్ 245

సగణ యగణముల సంయోగము కృత్యాదిలో నున్నచో శుభము గలుగును. జ-యలు కృతిపతికి జయకీర్తుల నిచ్చును. ర-యలు సుఖ మిచ్చును. మ-యలు అభ్యుదయ మొసఁగును.

క. నభలం జెప్పిన జెప్పిన విభవము
రభలం జెప్పినను జెట్ట రయమున వచ్చున్
శుభమగు మయలం జెప్పిన
సుభయము వర్తిల్లునందు రుత్తమచరితా 246

న-భలు సంపదను, ర-భలు కీడును, మ-యలు శుభములను, కృతి కర్త భర్తలకుఁ జేకూర్చును.

(భీమన ఛందము)

ఆ. సగణమగణములు పొసంగిన విభవంబు
రనగణంబు లెనయఁ బ్రబలుఁ గీడు;
రగణ యగణయుతము రాజ్యప్రదంబగు;
భయము లిరువురకును భయము లిడును 247

(కవిసర్పగారుడము)

సగణ మగణములు సంపదనిచ్చును. రగణ నగణములు హాని కరము. రగణ యగములు రాజ్యప్రదము. భగణ యగణములు కృతికర్తకును, గృతిభర్తకును భయము గలిగించును.

కం. యగణముతో యగణంబును
జగణముతో జగణములును సగణముతోడన్
సగణంబును రగణముతో
రగణంబునుగూర్చి చెప్ప రాదయ్యెడలన్ 248

యగణ ద్వయమును, జగణద్వయమును, సగణద్వయమును, రగణ ద్వయమును పద్యాదిలో నిలిపి చెప్పరాదు.

## నక్షత్ర గుణదోషములు

కం. కమలహితుఁడున్న నక్ష
త్రము మొదలుగ నేడుదోష తమములు నెనమన్
ప్రమదప్రదములు పంద్రెం
డమరంగ నశుభములు తొమ్మి దగుఁ బద్యాదిన్ 249

(కవి గజాంకుశము)

సూర్యుఁడున్న నక్షత్రము మొదలుకొని యేడు నక్షత్రములు దుష్టములు. ఎనిమిదవ నక్షత్రము మొదలుకొని పంద్రెండు నక్షత్రములను శుభకరములు. తరువాతి తొమ్మిది నక్షత్రములును అభిజిత్తులోఁగూడి యశుభకరములు. (అభిజత్తుతోఁగూడ నక్షత్రములు ఇరువదియెనిమిదియని గ్రహింపవలెను) ఉత్తరాషాఢా చతుర్థపాదమును, శ్రవణ ప్రథమ పాదమును గలిసినది అభిజిత్తు.

## జీవ నిర్జీవ నక్షత్రములు-తత్ఫలములు

క. విదితముగ రాహుభుక్తిని
నొదవిన పదమూఁడు జీవ ! యుక్తములం దు
న్నది యావల నరితారలు
పదునాలుగు మృతములనఁగఁ ! బడు నల్లెడలన్. 250
(శ్రీధరచ్ఛందము)

రాహువున్న నక్షత్రము మొదలుకొని పదమూఁడు నక్షత్రములును జీవనక్షత్రములు. తరువాతి పదునాలుగును నిర్జీవ నక్షత్రములు.

క. పతి మృతుఁడగుఁ బద్యాదిని
మృత నక్షత్రంబు నిడిన ! మేదుర సౌఖ్యా
న్వితుఁడగు నమృతములన న
ప్రతిమములగు తారకములఁ బద్యాది నిడన్. 251
(కవి గజాంకుశము)

మృతనక్షత్రగణము పద్యాదిలో నిడినచోఁ గృతిపతి మరణించును. అమృత నక్షత్ర గణము నిలిపినచో నత్యంతము సౌఖ్యవంతుఁడగును.

క. మొదలను జీవగణం బిడఁ
గొదలేక కృతీశు బ్రదుకు ! గొనసాగు మదిన్
వెదకక నిర్జీవగణం
బదికిన నపుడా కృతీశు ! నాయువు దఱుఁగున్. 252

జీవ నక్షత్రముగల గణము పద్యాదిలోఁ బ్రయోగించినచోఁ గృతి

పతి దీర్ఘాయుష్మంతుఁ డగును. నిర్జీవ నక్షత్రముగల గణమును బ్రయో గించినచో నాయుస్సు నశించును.

## దగ్ధజ్వలిత ధూమిత నక్షత్రములు

క. క్రూర గ్రహ ముక్తములగు
తారలు దగ్ధములు, ధూమితంబులు వానిన్
జేరి మొదు రెదుర నున్నవి
క్రూర గతంబులని యెఱుఁగి కొను జ్వలితంబుల్. 253
(గోకర్ణ ఛ్ఛందము)

క్రూరగ్రహములయిన సూర్యాంగారక శనిరాహు కేతువులు వసించి విడిచిపెట్టిన నక్షత్రములు. దగ్ధ నక్షత్రములు ఆగ్రహములప్పుడున్నవి జ్వలిత నక్షత్రములు. ప్రవేశింపఁబోవు నక్షత్రము ధూమిత నక్షత్రము. ఎట్లన-సూర్యుఁడు అశ్వినియందుండునేని దానికి ముందున్న రేవతి విడిచి పెట్టిన దగును. కావున రేవతి దగ్ధము. అశ్విని జ్వలితము. భరణి ధూమితము. ఈ నక్షత్రములలోఁ గావ్యారంభము చేయరాదు.

ఆ. ధనముఁ గోలుపుచ్చు దగ్ధనక్షత్రంబు;
చావుచేటుఁ దెచ్చు జ్వలిత తార;
ధూమితంబు మారి తునిజేయు నెప్పుడు;
గాన మొదల నిల్పఁ గాదు వీని. 254
(అథర్వణ ఛ్ఛందము)

పాప గ్రహములు విడిచిపెట్టినవి దగ్ధనక్షత్రములు. ఆ గ్రహము లున్నవి జ్వలిత నక్షత్రములు. దగ్ధ నక్షత్రములకుఁ బదమూఁడవ నక్ష త్రములు ధూమితములు. ఈ మూఁడు విధములయిన నక్షత్రములు గల

గణములను బద్యము మొదలఁ బ్రయోగింపరాదు. దగ్ద నక్షత్రము ధనమును నశింపఁజేయును. జ్వలిత నక్షత్రము మరణము నాపాదించును. ధూమిత నక్షత్రము మరణమును గలిగించును.

క. కృతి మొదల దగ్ధతారయుఁ
బతి నతి దుఃఖితునిఁ జేయు ప్రజ్వలితంబున్
మృతిఁ బొందించును మఱి ధూ
మిత నక్షత్రంబు నతని మే నలయించున్. 255

కృత్యాది యందు దగ్ద నక్షత్రము నిడినచోఁ గృతిపతికి దుఃఖము విచ్చును. జ్వలితనక్షత్ర గణము మరణమును దెచ్చును. ధూమిత నక్షత్రము కష్టముల పాలు సేయును.

క. పతితారకు సంబంధ
స్థితితారకుఁ జెల్లు కీడు చింతింపక దు
ర్మతిఁగవిత చెప్పఁ దివిరెడు
నతఁడె సుమీ కవిపిశాచ మారయ నుర్విన్. 256

కృతిపతి నక్షత్రమునకుఁ గృత్యాదిపద్యగణ నక్షత్రమునకు మైత్రి యుండువలయును. ఆ మైత్రి విషయము తెలియక కవిత వ్రాయు వానిని కవి పిశాచ మనఁదగును.

## గణగ్రహ మైత్రి

క. మగణాది గణంబులకును
బగయును మైత్రియు నెఱుంగఁ బడునుకవులకున్
జగమునఁ దత్తద్గ్రహముల
వగయును మైత్రియును శాస్త్రపద్ధతిఁగనఁగాన్. 257

మగణాది గణముల శత్రుత్వ మిత్రత్వములు తెలియక కవిత చెప్ప రాదు. సుకవు లన్నింటిని శోధించి కవిత చెప్పుదురు. కావునఁ బ్రతికవియు గణగ్రహమైత్రి నెఱుఁగ వలయును.

## శుభ పాప గ్రహములు

క. వారిజమిత్త్రి సూనుఁడును
వారిజమిత్త్రిఁడు భూమి పుత్త్రిడున్
గ్రూరులు; వారిఁ జేరు నెడఁ
గ్రూరుఁడు చంద్రతనూభవుండు; బృం
దారక రాజమంత్రియును
దైత్య గురుండును సౌమ్యుఁడ వ్విధుం
డారయఁ గృష్ణశుక్ల తిథు
లందు శుభప్రదు లెన్ని చూడఁగన్ 268

శని, సూర్యుఁడు, అంగారకుఁడు క్రూరులు. బుధుఁడు మంచి గ్రహమైనను పాపగ్రహములగు శనైశ్చరాదులతోఁ జేరియున్నచోఁ గ్రూరుఁడగును. బృహస్పతి, శుక్రుఁడు పాపగ్రహములతోఁ జేరని బుధుఁడును, శుక్ల కృష్ణ పక్షముల నడిమి తిథులయం దుండెడు చంద్రుఁడును శుభప్రదులు.

వారిజ మిత్ర సూనుఁడు=సూర్యపుత్త్రిడు-శని, వారిజమిత్రుఁడు= సూర్యుఁడు, భూమిపుత్త్రిఁడు=అంగారకుఁడు, కుజుఁడు, చంద్ర-తనూ భవుండు=చంద్రుని కొడుకు బుధుఁడు, బృందారక రాజమంత్రి-దేవేంద్రుని మంత్రి-బృహస్పతి, విధుఁడు=చంద్రుడు

క. తొలుత గణగ్రహమైత్రులు
దలఁపఁ ద్రికోణాధిపతులు - తత్తద్గ్రహ రా
సుల గణము వారణమ్మునఁ
గలసిన చుట్టంబులవియె గ్రహగణమైత్రుల్. 259

ఆ. ఏ యవస్థనుండి యే వేళనే గ్రహ
మే శుభాశుభంబు లిచ్చుచుండు
నా యవస్థనుండి యా వేళ నా గణ
మా శుభాశుభంబు లందఁజేయు. 260

గణ గ్రహముల మైత్రి నెఱింగి గణములను బ్రయోగింపవలయును. ఏ గ్రహములు ఎట్టిచోట్ల నుండిన ఏయే ఫలముల నిచ్చునో యెఱింగి గ్రహ సంబంధమయిన గణమును బ్రయోగింపవలయును.

ఆ. గ్రహము పొత్తుకలిమి గలగణసంగతి
నుండి క్రూరగ్రహము నొందు శుభము
గ్రహము పొత్తులేని గణముతోఁ బద్యాదిఁ
గూడి మంచిగణము కీడు సేయు. 261

దుష్టగ్రహము సయితము మైత్రిగల గణముతోఁ గూడెనేని మంచి సను. గ్రహమైత్రిలేని గణము మంచిదైనను హాని చేయును.

## గ్రహముల ఛాయలు

ఆ. శుక్రశశులు తెలుపు శోణిత వర్ణులు
తరణికుజులు బుధుఁడు సురగురుండు

పసిఁడి వన్నెవారు శ భానుజరాహువులు
నలిల జలధరంబు శ చాయవారు. 262

శుక్రుఁడు, చంద్రుఁడు తెల్లనివారు. సూర్యుడు, అంగారకుఁడు ఎఱ్ఱనివారు. బుధుఁడు, బృహస్పతి బంగారువన్నె గలవారు. శని, రాహువు, కేతువు నల్లనివారు.

చ. ఉడుపతి యే గ్రహంబుకడ
నున్నను దానును వాని వన్నెయున్
నడుమను నాశుభంబుగ గ
ణంబుల లోపల నే గణంబునం
గడి భగణంబు నిల్వ నధి
కంబుగ నా ఫల మిచ్చు నవ్విధుం
డొడయుడు గాన దానికిని
యుక్తమ యంద్రుడు కుయుక్తులేటికిన్. 263

చంద్రుఁడే గ్రహముతోఁ గూడియుండునో, యా గ్రహ కాంతి గలవాఁడగును. భగణ మే గణముతోఁ గూడి యుండునో యా ఫలము నిచ్చును. భగణమున కధిపతి యగు చంద్రుఁడును అట్టి ఫలమునే యిచ్చును.

ఉడుపతి = చంద్రుఁడు, ఒడయఁడు = అధిపతి.

ఆ. శ్వేత చంద్రుఁడయిన శ నేమంబుఁ గావించు
రక్తచంద్రుడయిన శ రణమొనర్చుఁ
గృష్ణచంద్రుడయిన శ క్రూరత లోఁడఁగూర్చుఁ
బీత చంద్రుఁడయిన శ ప్రీతినిచ్చు 264

తెల్లని చాయ గల చంద్రుఁడు క్షేమమును, ఎఱ్ఱని చాయ గల చంద్రుఁడు కలహమును, నల్లని చాయ గల చంద్రుఁడు కష్టములను, పచ్చని చాయ గల చంద్రుఁడు ప్రియమును ఇచ్చును.

### కృతిరచనకుఁ బ్రశస్తవారములు

క. శుక్ర గురు బుధవారముల్ ॥ సొంపునేయు
సోమవారంబు సంపదల్ ॥ సొరిది నిచ్చు
శనియు మంగళవారముల్ ॥ చావుదెచ్చు
భానువారంబు సంగరం ॥ బమరఁజేయు. 265

శుక్ర గురు బుధవారములందుఁ గావ్యారంభమును జేయుచో మేలు గలుగును. సోమవారమయినచో సంపత్కర మగును. శని మంగళవారము లయ్యేనేని మరణమగును. ఆదివారమయినచో యుద్ధము సిద్ధించును.

క. తలపోసి గద్యపద్యా
దుల నక్షరగణములకును ॥ దొరఁకొని మైత్రుల్
గలుగఁగఁ జెప్పిన హస్తా
మలకము గాఁ దగుఫలంబు ॥ మహి నిర్వ్యరకున్. 266

కావ్యాది నుండు నక్షరములకును, గణములకును మైత్రి గలుగునట్లు ప్రయోగించినచోఁ గృతి కర్తకును, గృతిభర్తకును అరచేతి యుసిరికవలె సులభముగా శుభఫలములు సిద్ధించును.

క. పొందెఱిఁగి యానుకూల్యము
నొందంగాఁ గూర్చి తగఁ బ్ర ॥ యోగించి కృతుల్
సందర్భించు గణాక్షర
బృందం బిరువురకుఁ జాలఁ ॥ బ్రీతి యొనర్చున్. 267

గణములకు అక్షరములకు గ్రహమైత్రి మున్నగు పొందిక లర కృత్యాదిలోఁ బ్రయోగించినచోఁ గృతి కర్తకు, గృతి భర్తకు శుభవ గలుగును.

క. శ్రీసర్వజ్ఞాంచితరస
నా సంవాసిత విశేష ♃ నామ బహువిధా
వాస! సులక్షణసారం
బా సో మార్కముగ నిల్పు క మననిసు తేశా! 26

తన యీ సులక్షణ సారమును ఆ చంద్రార్కముగ నిలుపుమ తన యిష్టదైవమగు రాముని బ్రార్థించుచున్నాఁడు.

మ. కరుణాబంధుర! కామదాయి!
కీతవఘ్నా, కీశసేవ్యా! కుభృ
ద్వర! కూలంకష కీర్తి! కేవల!
కృతార్థా! కైకసీపుత్రి రా
జ్యరమాస్థాపక కోటిసూర్యనిభ!
కౌసల్యాత్మజా! కంబుకం
ధర! కర్ణాంత విశాలనేత్ర!
రఘునాథా! భక్త చింతామణీ! 26

ఇది గ్రంథాంత పద్యము. ఇష్టదైవమగు శ్రీరాముని సంబోధనమ ఇది గుణితక్రమ చిత్ర కవిత. ఇందలి ప్రతి సమాసమును క గుణి క్రమమున - క, కా, కి, కే.... అనురీతిని రచింపఁబడినది.

సులక్షణ సారము

సమాప్తము.

# అనుబంధము
## సమవృత్తముల పట్టిక

| వృత్తముల పేర్లు | గణములు | యతి మైత్రి |
|---|---|---|
| విద్యున్మాల | మమగగ | 5 |
| భద్రకము | రనవ | — |
| మణిరంగము | రసగ | 6 |
| ఇంద్రవజ్ర | తతజగగ | 8 |
| ఉపేంద్రవజ్ర | జతజగగ | 8 |
| రథోద్ధతము | రనరవ | 7 |
| స్వాగతము | రనభగగ | 7 |
| తోదకము (పాదపము) | భభభగగ | 7 |
| భుజంగ ప్రయాతము | యయయయ | 8 |
| ఇంద్రవంశము | తతజర | 8 |
| వంశస్థము | జతజర | 8 |
| స్రగ్విణి | రరరర | 7 |
| ద్రుతవిలంబితము | నభభర | 7 |
| తోటకము | ససస స | 9 |
| తోదకము | నజజయ | 8 |
| వనమయూరము | భజసనగగ | 9 |
| వసంతతిలక | తభజజగ | 9 |
| మదన | ” | 9 |

| | | | |
|---|---|---|---|
| 15 | మాలిని | ననమయయ | 9 |
| | సరసాంకము | సజససయ | 10 |
| | సుగంధి | 7 హ+గ | 9 |
| 16 | పంచచామరము | జరజరజగ | 10 |
| 17 | శిఖరిణి | యమనసభవ | 13 |
| | పృధ్వి* | జసజసయవ | 14* |
| | మందాక్రాంత | మభనతతగగ | 11 |
| 18 | మత్తకోకిల | రసజజభర | 11 |
| | తరలి | భసనజనర | 11 |
| 19 | శార్దూలము | మసజసతతగ | 13 |
| | తరలము (ధ్రువకోకిల) | నభరసజజగ | 12 |
| | మేఘ విస్ఫూర్జితము | యమనసరగ | 13 |
| | చంద్రకళ | రససతజజగ | 11 |
| 20 | మత్తేభము | సభరనమయవ | 14 |
| | ఉత్పలమాల | భరనభభరవ | 10 |
| | అంబురుహము | భభభభరసవ | 13 |
| 21 | చంపకమాల | నజభజజజర | 11 |
| | స్రగ్ధర | మరభనయయయ | 8-15 |

* * పృధ్వీవృత్తమున కీ గ్రంథమున 14వ యక్షరము యతిమైత్రి చెప్పఁబడినది. ఇది పొరపాటు. 9 లేక 12 చెప్పుట లాక్షణిక మతము.

| | | | |
|---|---|---|---|
| 22 | మహాస్రగ్ధర | సతతనసరరగ | 9-16 |
| | మానిని | భభభభభభభగ | 7-13-19 |
| | తరళము | 7 నగణములు+గురువు | 13 |
| 23 | కవిరాజవిరాజితము | నజజజజజజవ | 8-14-20 |
| 24 | క్రౌంచపద | భమసభనననయ | 11-19 |
| 25 | సాధ్వి | భనజనసననభగ | 8-15-22 |
| 26 | ప్రభు | నననజజజజవ | 9-15-21 |
| | మలయజము | నజననననభనవ | 8-15-22 |
| | మంగళమహాశ్రీ | భజసనభజసనగగ | 9-17 |

## యతిభేదముల పట్టిక

యతులు ప్రధానముగా నాలుగు విధములు.

1. స్వరయతులు - అచ్చుల పరస్వరమైత్రిని దెలుపును.

2. వ్యంజనయతులు - హల్లుల పరస్వరమైత్రిని దెలుపును. హల్లునకు యతిమైత్రిని గూర్చునప్పుడు ఆ హల్లునకే కాక దాని మీఁది యచ్చునకుఁగూడ యతిమైత్రి యుండునట్లు చూడవలయును.

**ఉదా :** క-కా-కై-కౌ-గ-గా-గై-గౌ ఇట్లు చెల్లునేకాని క-కి-గు-గె అను రీతి చెల్లదు.

3. ఉభయ యతులు :—అచ్సంధిఁగూడిన రెండు శబ్దములలో సంధ్యక్షరము యతిస్థానమున నిలిచినచోఁబరపదాది స్వరమున యతి మైత్రిఁ గూర్పవలయును. కాని నిత్యసమాసాదులగు కొన్ని శబ్దము లందు అచ్సంధియున్నను వాన నేకశబ్దములుగా భావించి సంధిలో నిలిచిన హల్లునకు యతిమైత్రి చేయవచ్చును. నారాయణ, జనార్దన ఇత్యాది శబ్దములందు స్వరయతియు వ్యంజనయతియుఁ జెల్లును. కావున దీని కుభయయతి యనిపేరు. ఇదియే అఖండయతి యనఁ బడును.

4. ప్రాసయతి యతికి మాఱుగా మిత్రస్థానమునఁ బ్రాసము గూర్చుట.

| సులక్షణ సారము నందలి యతులు | సులక్షణ సారమూలమునను యతిభేదముల సంఖ్య |
|---|---|
| 1. స్వరయతి | 9 |
| 2. సరసస్వరయతి | 33 |
| 3. లుప్తవిసర్గక స్వరయతి | 34 |
| 4. ఋవడి | 11 |
| 5. రివడి | 27 |
| 6. ఇకారయతి | 37 |
| 7. వృద్ధియతి | 21 |
| 8. వర్గయతి | 3 |
| 9. అనుస్వారయతి | 8 |
| 10. జ్ఞావడి | 32 |
| 11. పోలికయతి | 6 |
| 12. చక్కటియతి | 7 |
| 13. మావడి | 12 |
| 14. యావడి | 10 |
| 15. అభేదయతి | 20 |
| 16. ఎక్కటియతి | 5 |
| 17. సరసయతి | 1 |
| 18. భిన్నయతి | 17 |
| 19. అభిన్నయతి | 19 |
| 20. సంయుక్తయతి | 2 |
| 21. వికల్పయతి | 25 |

37, 38 ఇవి యప్రశస్తయతులు—అగ్రాహ్యములు

## సులక్షణసార – అప్పకవీయములందలి యతుల సామ్యము

| సులక్షణ సారము | అప్పకవీయము |
|---|---|
| 1. స్వరయతి | స్వరమైత్రివళి (1) |
| 2. సరసస్వరయతి | స్వరప్రధానవడి (2) |
| 3. లుప్తవిసర్గక స్వరవళి | లుప్తవిసర్గకస్వరవళి (3) |
| 4. ఋవడి | ఋత్వసంబంధవళి (5) |
| | ఋత్వసామ్యవళి (6) |
| 5. ఱవడి | ఋవడి (4) |
| 6. ఌకారయతి | ———— |
| 7. వృద్ధియతి | వృద్ధివళి (7) |
| 8. వర్గయతి | వర్గజయతి (9) |
| 9. అనుస్వారయతి | బిందుయతి (10) |
| 10. జ్ఞావడి | తద్భవవ్యాజ విశ్రమము (11) |
| 11. పోలికయతి | ముప్రభ క్తియతి (15) |
| 12. చక్కటియతి | ముకారయతి (16) |
| 13. మావడి | మవర్ణవిరామము (17) |
| 14. యావడి | ———— |
| 15. అభేదయతి | అభేదయతి (22) |
| | అభేదవర్గయతి (23) |
| 16. ఎక్కటియతి | ఏకతరయతి (21) |
| 17. సరసయతి | సరసవళి (25) |
| | ఋజుయతి (18) |
| | ఊష్మయతి (24) |

| | |
|---|---|
| 18. భిన్నయతి | భిన్నయతి (20) |
| 19. అభిన్నయతి | ———— |
| 20. సంయుక్తయతి | సంయుక్తయతి (25) |
| 21. వికల్పయతి | అంత్యోష్మసంధియతి (27) |
| 22. అనునాసిక వికల్పయతి | వికల్పయతి (28) |
| 23. ఋావడి | ———— |
| 24. ఉభయయతి | యుష్మదస్మచ్ఛబ్దయతి (29) |
| 25. పరరూపయతి | పరరూపయతి (30) |
| 26. ప్రాదియతి | ప్రాదియతి (31) |
| 27. నిత్యసమాసయతి | నిత్యసమాసయతి (32) |
| 28. ఆదేశయతి | ” ” |
| 29. దేశీయయతి | దేశ్యనిత్యసమాసయతి (33) |
| 30. నిత్యయతి | నిత్యయతి (34) |
| 31. విభాగయతి | విభాగవళి....(36) |
| 32. ప్రభుయతి | నామాఖండయతి (37) |
| 33. కాకుస్వరయతి | కాకుస్వరళి (39) |
| 34. ప్లుతయతి | ” ” |
| 35. అఖండయతి | ———— |
| 36. సౌభాగ్యయతి | ———— |
| 37. యవర్గయతి | ———— |
| 38. శవర్గయతి | ———— |
| 39. ప్రాసయతి | ప్రాసయతి (41) |

**సులక్షణసారమున లేక అప్పకవీయమున అధికముగనున్న యతులు 8. అవి :-**

ప్రాణి విరామము (8)
విశేషవళి (12)
అనుస్వార సంబంధయతి (13)
అనునాసికాక్షరయతి (14)
ప్రత్యేకయతి (19)
రాగమ సంధి వడి (35)
పంచమీ విభక్తియతి (38)
ప్లుతయుగ విశ్రమము (40)

## పంచభూత బీజాక్షర చక్రము

| | |
|---|---|
| 1. వాయుబీజములు | అ ఆ ఏ క చ ట త ప య వ |
| 2. అగ్నిబీజములు | ఇ ఈ ఐ ఖ ఛ ఠ థ ఫ ర స |
| 3. భూబీజములు | ఉ ఊ ఓ గ జ డ ద బ ల హ |
| 4. ఉదకబీజములు | ఋ ౠ ఔ ఘ ఝ ఢ ధ భ వ శ |
| 5. ఆకాశబీజములు | ఌ ౡ అం ణ ఙ ఞ న మ శ క్ష |